# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Sunday, the 30th September 1956.**

The House met in the Assembly Hall, Kurnool, at ten of the Clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Enhancement of Education Cess*

273.

* 103 Q: SRI S. VEMAYYA:—Will the Hon. the Chief Minister be pleased to state:

(a) whether it is a fact that· Educational cess will be enhanced in pursuance of the orders of the Government of India; and

(b) if so, to what extent it will be raised?

THE HON. Dr. B. GOPALA REDDI:—

(a) the question is under consideration.

(b) Does not arise.

SRI S. VEMAYYA:—ఎంతవరకు మీరు పన్ను వేసుకొనవలెనని కేంద్ర ప్రభుత్వము నిర్దిష్టమైన సలహా ఇచ్చిందా?

THE HON. Dr. B. GOPALA REDDI:— మద్రాసుకు, ఆంధ్రకు సంబంధించిన సలహా కాదు. ఇతర రాష్ట్రాలలో Educational cess లేదనుకుంటాను. ఆ రాష్ట్రాలకు ప్రత్యేకముగా ఇవ్వబడింది. మన రాష్ట్రములో 36 పైసలు వసూలు చేస్తున్నామని తెలిపినాము. ఆ circular మనకోసము ఉద్దేశింపబడినది కాదు.

SRI V. VISWESWARA RAO:—కేంద్ర ప్రభుత్వం 36 పైసలు కాక ఇంకా అదనముగా వెయ్యమని సలహా ఇచ్చిందా, లేక 36 పైసలు వసూలు చెయ్యమని చెప్పిందా? ఇప్పుడు 24 పైసలు వసూలు చేస్తున్నారు.

THE HON. Dr. B. GOPALA REDDI:—36 పైసలు చాలా కాలము నుంచి వసూలు చేస్తున్నారు. 1949–50 లో మద్రాసులో మాధవ

మీననుగారు విద్యా మంత్రిగా ఉన్నప్పటి నుంచి అమలులో ఉన్నది. 1950 లో 36 పైసలు చెయ్యబడింది. ఇది ఇతర రాష్ట్రాలకు సంబంధించినదని నేను అనుకొంటున్నాను. Elementary Education cess ఉన్నచోట వసూలు చేయకూడదు అన్నారు.

SRI S. VEMAYYA :—36 పైసలు ఇక్కడ వసూలు చేస్తున్నారు. కనుక ఇంకా పన్ను వసూలు చేయకుండా చూస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇప్పుడె తీసుకుంటున్నాము కాబట్టి అవసరము లేదని అన్నాము. గౌరవ సభ్యుల అభిప్రాయము అయితే ఎక్కువ చేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Cicularలో అభ్యంతర విషయములు లేకపోతే దాని కాపీ అందరికీ అంద చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—దానిని అందచేయ్యడానికి ఆక్షేపణ ఏమీలేదు. Confidential ఏమీ లేదు. పదే పదే సైక్లుస్టయిలు చెయ్యడము అవసరం లేదు. దాని సారాంశం ఇదే. ఇంకా ఎక్కువ వ్యాప్తి చెయ్యవలెను కాబట్టి మీరు Education Cess వేసుకొని వ్యాప్తిచేస్తారా అని అడిగారు. మా province లో ఇప్పటికే 36 పైసలు ఉందని చెప్పేము.

SRI G. YELLAMANDAREDDI :— మనరాష్ట్రం education cess వేస్తున్నదికాబట్టి రెండవప్లాను క్రింద కేంద్రప్రభుత్వము గ్రాంటు పూర్తిగా ఇవ్వడానికి తయారుగా ఉన్నదా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— దానికి దీనికి సంబంధము లేదు. Education cess కు వారి గ్రాంటులకు సంబంధము లేదు. పెన్షను విషయములో సగము పెట్టుకుంటే సగము ఇస్తామ వారు చెపుతూనే ఉన్నారు. మనము ఇవ్వవలసినది 66 లక్షలు అగుతుంది. అది ఇచ్చుకోలేనిస్థితిలో ఉన్నాము.

SRI S. VEMAYYA :— రాష్ట్రమొత్తముమీద ఈ సెస్సు ఎంతో approximate గా చెప్పగలరా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— చెప్పలేను.

*Loss on account of the heavy cyclonic weather*

275.

* 210 Q: Dr. S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

30th September 1956 ]

(a) the loss estimated in the State on account of the heavy cyclonic weather that occurred during the last week of April 1956; and

(b) the nature of assistance rendered by the Government to the public in the matter ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) & (b) :—Only the districts of Nellore, Chittor and Cuddapah were affected by the cyclone on 29-4-1956 and 30-4-1956. A statement * showing the extent of damage and the measures taken for granting trelief is placed on the Table of the House.

SRI S. VEMAYYA :— ఈ సంవత్సరపు గాలివానలో 2,152 ఇళ్లు పడిపోతే ప్రభుత్వంవారు 35 వేలు allot చేసినట్లు చెపుతున్నారు. 2 వేల ఇళ్లు పడినవారికి ఎవరెవరికీ ఎంతెంత పంచిపెట్టేరు? ఎలాగ allot చేసినారు? ఎన్ని కుటుంబాలకు చేరింది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Appoximate గా నష్టం చూసి allot చేసినారు. Details కావలెను అంటే ఎంతెంత ఏ ఏ ఇంటికి ఇచ్చినారో కావలెను అంటే వేరే ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI S. VEMAYYA :— కడపలో గాలివానకు చెడిపోయిన చెరువులు repairs గురించి అడిగితే action is being taken అని అన్నారు ఎన్నింటిని repair చేసినారు? ఇంకా ఎన్ని ఉన్నవి?

THE HON. SRI K CHANDRAMOULI :— Details లేవు. వేరే ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI V. VISWESWARA RAO:— Cyclone relief ఇచ్చినపుడు ప్రభుత్వము గ్రాంటు ఇవ్వడము జరుగుతోంది. ఇళ్లు పూర్తిగా పడిపోలేదని, పైకప్పు పడిపోలేదని, గోడ పడిపోలేదని, చిన్నచిన్న ఆటంకములు చూపి ఇవ్వకుండా ఉన్నారు. అట్లా జరుగకుండా సరిగా ఇస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI:— దీనికి అంతకూ ఒక విధానము ఉంది. ఇల్లు పడినవారికి ఎక్కువ, గోడ పడినవారికి తక్కువగా ఇస్తున్నారు. ఆ విధముగా ఉంటుంది. తరువాత ఎపుడో పడిపోతవి అని ఆలోచించడానికి వీలులేదు.

* Vide appendix I at page 604 infra.

SRI G. YELLAMANDA REDDI:— వేమయ్యగారి ప్రశ్నకు మంత్రి గారు సమాధానము చెప్పలేదు. 35,000 allot చేసినామన్నారు. ఎంత ఖర్చు పెట్టినారో చెప్పలేదు. ఖర్చు పెడితె ఎంత ఖర్చు పెట్టారు.

THE HON. SRI K. CHANDRAMOULI:— వేరే ప్రశ్న వెయ్యమని చెప్తున్నాను.

SRI S. VEMAYYA:— 35,000 allot చేసినామన్నారు. ఇప్పటివరకు అలాగేఉంటే, ఇకమీదట వెంటనే disperse చేయడానికి ఉత్తర్వులు జారీచేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI:— కొంతఖర్చు జరుగుతూ ఉంది. వివరములు కావలెనంటే వేరే ప్రశ్న వెయ్యండి.

SRI S. VEMAYYA:— I want to know whether the government is giving instructions to disperse in deserving cases.

THE HON. SRI K. CHANDRAMOULI:— ఇంతవరకు జరుగక పోతే ఇస్తాము.

*Research Institute for Handloom Industries*

276.

* 504 Q: SRI P. VENKATASUBBAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether the All-India Handloom Board sanctioned a Research Institute for this state?

THE HON. SRI K. VENKAT RAO :—Yes, sir. The All-India Handloom Board has approved the scheme for the setting up of a research institute in Andhra. The specific sanction of the scheme by the Government of India is awaited.

ఔనండి.

Al. India Handloom Board వారు ఒక Research Institute పెట్టడానికి ఆమోదించారు. ఇంకా తుది ఆర్డర్ల కోసము వేచి ఉన్నాము.

SRI K. VIJAYABHASKARA REDDI :—మన దేశం మొత్తంపైన ప్రధానమైన Handloom Society ఎమ్మిగనూరులో ఉన్నది కాబట్టి అక్కడ ఈ Research Institute పెట్టడానికి ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇంకా అసలు Scheme sanction కాలేదు. స్థలాన్ని గురించి ఏమి ఉంది. అది మంచి ప్రదేశము కనుక అది కూడా ఆలోచిస్తాము.

*Electricity transmission lines in Palnad taluk*

277.

* 531 Q: SRI M. NAGI REDDI :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) the villages of Palnad taluk through which the transmission lines supplying electricity to the Nagarjunasagar Project will pass; and

(b) whether electricity will be supplied to the villages situated by the side of these transmission lines ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The transmission line from Tadepalli to Macherla to feed the Nagarjunasagar Project works has been designed to operate at 66 KV for transmission of bulk power and hence it is not possible to feed enroute villages. Enumeration of the villages through which the above line passes is therefore unnecessary.

(b) Supply of electricity to the villages in Palnad Taluk can be effected from the Macherla sub-station. The feasibility of separate extension schemes therefore will be examined if sufficient loads come forth from the prospective consumers.

*Abolition or retention of District Boards*

279.

* 689 Q: SRI P. GOPALU REDDI :
SRI M. NAGI REDDI :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether Government have come to a decision on the question of District Boards being retained or abolished ;

(b) if so, what is the action taken in the matter ; and

(c) if not, what do Government propose to do next ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) Government have decided that District Boards should remain.

(b) & (c) They have not decided as to how the District Boards be reconstituted. They propose to consider this question after the merger of Telangana with Andhra and in the meanwhile, to undertake

legislation to extend the life of Special Officers of District Boards till 10-12-1957.

*Trainees in Fisheries Technology*

280.

* 341 Q: SRI G. NAGESWARA RAO:—Will the Hon. the Minister for Agriculture be pleased to state:

(a) number of candidates trained in Fisheries Techonology and Navigation Diploma Course at Kakinada, Polytechnic;

(b) how many of them are employed in the Fisheries Department; and

(c) the reasons for recruting directly, B.Sc., B.Sc. (Hons.), and M.A. or M.Sc., Zoology candidates as Fisheries Inspectors while candidates trained in the Fisheries Technology are available?

THE HON. SRI K. OBULA REDDI:

(a) 51 during the years 1949 to 1956.

(b) 29 diploma holders were employed in the Fisheries Department.

(c) The diploma in Fisheries Technology and Navigation is no recognised as a qualification for direct recruitment to the posts of Inspectors of Fisheries.

SRI G. NAGESWARA RAO:— Fisheries diploma course pass అయినవాళ్లను 59 మందిని appoint చేశారు అంటున్నారు. Unemployed గా ఉన్నవాళ్లను ఎక్కడా చేర్చుకోలేదు. డిప్లొమా pass అయినవాళ్లను కాకుండా M. Sc. మొదలైన qualifications ఉన్నవాళ్లను direct గా Inspectors గా చేర్చుకుంటున్నారు. వారిని agriculture, animal husbandry మొదలైనవాటిలో కూడా చేర్చుకోవచ్చు. Diploma pass అయినవాళ్ళను ఈపనికి తీసుకోకుండా M. Sc., B. Sc. పాసయినవాళ్లను తీసుకుంటే fisheries department ఏవిధంగా అభివృద్ధి చెందుతుంది? డిప్లమోpass అయినవాళ్లను వేసుకొనడానికి చూస్తారా?

THE HON. SRI K. OBULA REDDI:— ఆలోచిస్తారు.

*Publication of Gazette and Budget Papers, etc., in Telugu*

281.

* 139 Q: SRI P. HANUMANTHA REDDI:—Will the Hon. the Chief Minister be pleased to state why the Andhra Gazette and Budget Papers, etc., are not published in Telugu?

30th September 1956]

THE HON. Dr. B. GOPALA REDDI :—Telugu has not been adopted as the language to be used for all or any of the official purposes of the State by a Law under Article 345 of the Constitution of India and so publication of the Gazette and Budget papers in Telugu is not necessary. But notifications and supplements to the Andhra Gazette which are of interest to the public are published in Telugu also even now. In regard to Budget papers, it is proposed to consider publication in Telugu also in connection with the Budget for 1958-59.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— శాసనసభ కూడా తీర్మానం చేసినది, వీలైనంత త్వరలో పరిపాలనా విధానం నడపాలని. ప్రతికాపీ ఇంగ్లీషుతోబాటు తెలుగులో వచ్చేట్లా ఏర్పాట్లు చేస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI:— సాధ్యమైనంత వరకు ప్రయత్నం చేస్తున్నాము. బడ్జెటు ఉపన్యాసంకూడా తెలుగులో ఇవ్వబడింది. అసెంబ్లీ తీర్మానంసంగతి అట్లాఉండగా ఆర్టికలు 345 క్రింద తీర్మానం చేసుకో లేదు. అది ఉన్న Constitutional position.

SRI A. KALESWARA RAO:— ఆర్టికలు 345 క్రింద చర్య తీసుకొన వలసిన బాధ్యత మంత్రిగారిది. మంత్రిగారు ప్రవేశపెడితే మేముఅంతా ready గా ఉన్నాము. ఇంతకాలంనుంచి ఎందుకు చేయలేదో సంజాయిషీ ఇవ్వాలని అడుగు తున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI:— ఆర్టికలు 345 క్రింద action తీసుకోడానికి కాలం అనుకూలంగా లేదు.

*Satyagraha by Sri Rama Rao against the mal-administration of the Tirumalai-Tirupati Devasthanam*

283.

* 692 Q : SRI P. GOPALU REDDI:—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether Government are aware that one Sri Rama Rao offered satyagraha at Guntur protesting against the mal-administration of the Tirumalai-Tirupati Devasthanam ; and

(b) if so, what is the action taken by the Government thereon?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) Yes. One Sri T. V. S. Rama Rao was on hunger strike from 4-7-1956 to 20-7-1956 at Guntur as a protest against the alleged mis-management of Tirumalai-Tirupati Devasthanams.

(b) The Government informed him that the matter was under consideration and he gave up the fast on 21-7-1956.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Mismanagement అని allege చేసిన కారణాలు చెప్పగలరా ?

Mr. SPEAKER :—How are we interested ?

*Development of Indigenous Medicine in Andhra*

284.

* 520 Q : SRI M NAGI REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state .

(a) whether the Government have proposed to constitute a Board for developing Indigenous Medicine in Andhra ; and

(b) if so, who are the persons proposed to be nominated as members of the Board ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The answer is in the affirmative-

(b) This question will be taken up after the "Andhra Ayurvedic and Homeopathic Medical Practioners Registration Bill" is passed into Law.

SRI T. JIYYARDAS :—ఆయుర్వేదం బిల్లుకంటె వెనుక పంపిన బిల్లులు ప్రెశిడెంటు ఆమోదం పొంది వచ్చినాయి. దీనికి ఆమోదం రాలేదు. కారణం చెబుతారా ?

THE HON. SRI K. VENKATA RAO :—గొప్పతనం అందులోనే ఉన్నది.

SRI G. RAMI REDDI :—ఆయుర్వేద బోర్డులో సభ్యులను ఏ ప్రాంతాలనుండి వేస్తారు ? అందరిని వైద్యులనే వేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నిప్పత్తులు, పరపతులు, ప్రాంతాలు ఇందులో ఆలోచించ బడవు. సిలబను తయారుచేసి దీనిని ఉన్నత స్థాయిలో ఉంచాలి కనుక గొప్ప పండితులను పనిచేయగలిగిన వారిని ప్రత్యేకంగా వెతికి వేస్తాము.

SRI R. B. RAMAKRISHNA RAJU :—సెక్షను 3 క్రింద రిజిష్టరు అయిన వాళ్ళలోనుంచి వేస్తారా ? ఎటువంటి వారిని చూసి వేస్తారు ?

THE HON. SRI K. VENKATA RAO:—క్లాజులన్నీ పాటించి వేస్తాము. సిలబసు తయారు చేయడానికి, ఒక స్వరూపం ఇవ్వడానికి వారికి కొన్ని powers ఇస్తాము. అందుచేత దీనికై బాగా ఆయుర్వేదము చదువుకొన్న వాళ్ళను వేస్తాము.

SRI P GUNNAYYA:—పూజ్యులైన వెంకట్రావుగారు Health Department లోను Doctors, Nurses అన్ని విధాల అనుభవం ఉన్న వెంకట్రావుగారికి, ముఖ్య మంత్రిగారికి ఇచ్చిన డాక్టరు బిరుదు ఇప్పించడానికి ఆంధ్ర ప్రభుత్వం recommendation చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—నాకు డాక్టర్ల అనుభవం ఉన్నది కాని Nurses అనుభవం లేదు.

SRI A. KALESWARA RAO:— బోర్డులు వేస్తాము అంటున్నారు. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ తరువాతనా ? ఈ లోపుగానేనా ?

THE HON. SRI K. VENKATA RAO:— ఆంధ్ర ప్రదేశ్ వెళ్లక పూర్వమే వేద్దామని ఉన్నది. ప్రెసిడెంటు assent రాగానే వేస్తాము.

SRI S. VEMAYYA:— ఈ బోర్డులో C క్లాసు వైద్యులకు గ్రామ వైద్యులకు representation ఇచ్చి వారి సలహాలు తీసుకుంటారా ?

THE HON. SRI K. VENKATA RAO:—'సి' క్లాసు లేదు ఇపుడు. బిల్లు పాసయిన తరువాత ఉంటారు.

SRI R. B. RAMAKRISHNA RAJU:— ఈ మంచి పండితులను ఎవరు ఏరుతారు ? ఎవరి సలహా అయినా తీసుకుంటారా ?

THE HON. SRI K. VENKATA RAO:— నేను పండితుణ్ణే. పండితుణ్ణి తెలుసుకునే విచక్షణా జ్ఞానం నాకు ఉన్నది.

*Development of Homoeopathic Medicine*

285.

*521 Q: SRI M. NAGI REDDI:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether the Government have proposed to constitute a Board for developing the Homoeopathic Medicine in Andhra; and

[30th September 1956

(b) if so, who are the persons proposed to be nominated as Members of that Board?

THE HON. SRI K. VENKATA RAO:—

(a) The answer is in the affirmative.

(b) This question will be taken up after "The Andhra Ayurvedic and Homoeopathic Medical Practitioners Registration Bill" is passed into Law.

*Extension of Employees' Provident Fund Scheme to the Tobacco Industry*

286.

* 756 Q: SRI M. NAGI REDDI:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) Whether the Government propose to extend the Employees' Provident Fund Scheme to the Tobacco Industry; and

(b) if not, why the Government do not intend to extend the scheme to the tobacco industry while they have applied it to so many other industries?

THE HON. SRI G. LATCHANNA:—

(a) No, Sir.

(b) The Employees' Provident Fund Act, 1952 is a Central Act and it is for the Government of India to extend it to the tobacco industry.

SRI M. NAGI REDDI:— ఈ చట్టం Government of India కు సంబంధించినది అయినప్పటికి పొగాకు ఆంధ్రలో ప్రధానమైన పరిశ్రమ కాబట్టి కేంద్ర ప్రభుత్వానికి ఆంధ్ర ప్రభుత్వం ఇక్కడ అనువర్తించేట్లా సూచన చేస్తుందా?

THE HON. SRI G. LATCHANNA:— ఏ ప్రాంతాలలో పెట్టవలసింది, ఎక్కడెక్కడ అనులు చేయవలసింది రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రేరేపించేది ఇండియా ప్రభుత్వం. దానిని నిర్ణయించవలసింది ఇండియా ప్రభుత్వం. గౌరవ సభ్యులు ఎటువంటి సూచనలయినా చేస్తే ప్రభుత్వం పరిశీలిస్తుంది.

SRI M. NAGI REDDI:— కేంద్రప్రభుత్వదృష్టిలో పొగాకు పరిశ్రమ తక్కువగా కనిపించవచ్చు. ఆంధ్రలో తీసుకుంటే ఇదే ముఖ్యమైన పరిశ్రమ, కొన్ని లక్షలమంది పనిచేస్తున్నారు, ఆంధ్రప్రభుత్వం దీనిమీద తగిన చర్య తీసుకుని కేంద్రానికి recommendation చేస్తారా?

30th September 1956]

THE HON. SRI G. LATCHANNA :— ఇది seasonal factory అని గౌరవ సభ్యునికి తెలుసు.

SRI M. NAGI REDDI :— Seasonal factories కాకుండా మిగతావి కూడా ఉన్నాయి. సంవత్సరం అంతా కొన్ని కార్యక్రమాలు చేస్తుంటారు. వాటి విషయమయినా ఆలోచిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :— గౌరవసభ్యులు చెప్పవలసింది వ్రాత పూర్వకంగా ఇస్తే పరిశీలిస్తాము.

*Appointment of Excise Department Officers as District Welfare Officers*

287.

* 794 Q: SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) whether the Government have appointed any officers of the Excise Department as District Welfare Officers; and

(b) if so, how many and what are their names?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—

(a) The answer is in the affirmative.

(b) Two Inspectors of Excise, viz., Sri K. L. Narayana and Sri N. Subrahmanyam have been appointed as District Welfare Officers.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Excise Department లో ఉన్న అనుభవానికిన్నీ Welfare Department అనుభవానికిన్నీ చాలా దూరంగా ఉంటుంది. అట్లాంటిది వాండ్లను అక్కడ పెట్టితే Welfare కు excise అవుతుందేమో అని మాకు అనుమానంగా ఉంది. వాండ్లను ఎందుకు వేయవలసి వచ్చింది ? Welfare Department లో ఎక్కడాలేరా మనుష్యులు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అయ్యా ఇది Excise Department. 8 మంది Gazetted ఆఫీసర్లు surplus గా ఉన్నారు. వారికి ఏమి పనిలేకుండా డబ్బు ఇవ్వవలసి వచ్చింది. వారిని ఇతర Departments లో ఏర్పాటు చేయవలెనని మంత్రివర్గం నిశ్చయించింది. ఆ 8 గురిలో ఒకరు 1957 జనవరిలో రిటైరు అవుతున్నారు. తక్కిన 7 గురిని వివిధమైన department లలో absorb చేయడంకోసం ఇద్దరిని Welfare Department కు వేయవలసి వచ్చింది. వారు మంచివారనే వేయడం జరిగింది.

SRI P. SREERAMULU:— ఈ excise department లో ఉన్నటువంటి ఆఫీసర్సుని ఎక్కడో ఒకచోట absorb చేయడమే ప్రభుత్వ పాలసీ అయినపుడు ఈ welfare ఆఫీసరుగా వేయటంలో ఈ land acquisition, Harijan sites వగైరాలలో ఎక్కువ Revenue department కు సంబంధించినది కాబట్టి వారిని అందులో absorb చేసి, అసలు ఈపని ఇదివర కున్నదానికంటే ఇంకా కుంటుపడేటట్లు చేయకుండా ఇదివరకు Revenue department లో అనుభవం అయినటువంటి వారినే welfare department లో ఉంచేటట్లు ప్రభుత్వం పునరాలోచిస్తుందా?

THE HON. SRI A. B. NAGESWARA RAO:— ఇదివరకు వేయబడిన వారంతా Revenue శాఖ లోనివారే. వీరుకూడా కొంచెం experience ఉన్న ఆఫీసర్లు కాబట్టి వేశాము. అటువంటి అపోహాలు ఏమీ ఉండనక్కరలేదని గౌరవ సభ్యులకు నేను మనవిచేస్తున్నాను.

SRI N. K. LINGAM:— అధ్యక్షా, Excise department నుంచి Welfare department కు ఇద్దరిని వేశాం అని మంత్రిగారు సెలవిచ్చారు. కాని ఈ welfare department, excise department పరస్పర విరుద్ధమైనటువంటి department లు. వాండ్లను వేసేదానికి ముందుగ వాండ్లకు ఏమైనా ఈ సాంఘికమైనటువంటి training ఇచ్చి వారిని appoint చేశారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO:— సాంఘికమైన training ఏమీ లేదండి. అనుభవంగల ఆఫీసర్లు కాబట్టి ఇందులోకూడ బాగా పని చేస్తారనే ప్రభుత్వం ఆలోచించి నియమించింది.

SRI T. JIYYAR DASS:— అధ్యక్షా, welfare department అంటే కొంచెం అర్థం బాహుళ్యంగా ఉన్నట్లు సభవారికి కనబడుతుందేమో? అది వెనుకబడిన జాతులకును, అణగ పెట్టిన జాతులకును సంబంధించినటువంటి సంస్థ. ఎక్కడా పనికిరాదు గనుక తీసుకొనివచ్చి ఇటువంటి సంస్థలో ఈ ఆఫీసర్లను వేశారా? ఆ ఆఫీసర్లను క్రిష్ణా, గుంటూరుజిల్లాలకే కేటాయించారు. ఇది చాల బాధ్యతతో కూడుకొన్న జిల్లాలు. Acquisition act బాగా తెలిస్తేగాని ఈపని నిర్వహించలేరు. ఆ ఆఫీసర్లు మేము ఉండలేమని చెప్పుతున్నారు, ప్రభుత్వానికి తెలుసునా?

THE HON SRI A. B. NAGESWARA RAO :— ఇంతవరకు వారు ఉండమని ప్రభుత్వానికి వ్రాయలేదు. వారిని ఇతర departments లో absorb చేయడానికి Secretariat level లో ఒక కమిటీ వేశారు. తర్వాత ప్రభుత్వం level కు వచ్చింది. ఇవి అన్నీ దీర్ఘంగా ఆలోచించే వారు మంచి ఆఫీసర్లని వేశాము.

SRI V. VISWESWARA RAO :— అధ్యక్షా, ఈ excise department లో 8 గురు ఉన్నారు. వాండ్లను absorb చేసుకొంటామని చెప్పుతున్నారు. వాండ్లను ఎప్పటిలోగా absorb చేసుకొంటారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ఆ 7 గురుకూడా గెజెటెడ్ ఆఫీసర్లు. వారిని different departments లో absorb చేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఈ నడుంగా, welfare ఆఫీసరుగారి car లో సారాయితోసహా ప్రయాణం చేశారని తెలుస్తున్నది. అట్లాంటిది ఈ welfare ఆఫీసరు ఇక్కడకూడా చేస్తారేమో ? బట్టీలన్నికూడా దాంట్లో ఉన్నాయట. పట్టుకోడానికి పోయినవారందరికి పంచిపెట్టుతారేమో మాకు భయంగా ఉంది. అందుచేత excise department నుండి వస్తే ఈ ప్రమాదం రాకుండా చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— అయ్యా, ఇంత వరకు ప్రభుత్వంయొక్క నోటీసులోకి రాలేదు. గౌరవసభ్యులు వ్రాతపూర్వకంగా వ్రాసిఇస్తే తప్పకుండా వారిమీద చర్య తీసుకొంటాము.

SRI S. VEMAYYA :—ఈ Excise Departmentలో ఉన్నవారికి కేసులు వగైరాలు పెట్టడానికే ఎక్కువ సమర్థత ఉంటుందిగాని, వాండ్లకు allotment ఇచ్చినటువంటి Department Administration బాగా తెలియదు. కాబట్టి మన ప్రభుత్వం వారికి కొత్త ఉద్యోగాలు, ఈ సాంఘికంగా దురలవాట్లు వగైరాలు మాన్పించడానికి, ఈహరిజనులు వగైరాలకు సాంఘికంగా వచ్చేఇబ్బందులు అన్నింటిని అరికట్టడానికి, వాండ్లు కేసులు పెట్టి సరియైనటువంటి సాంఘిక కట్టుబాట్లు మన యొక్క చట్టరీత్యా implement చేయడానికి, ఈ ఉద్యోగులను ప్రత్యేకించుతారా ? ఈ ఉద్యోగస్తులకు welfare ఆఫీసరు అనే designation లేకుండా ఈ హరిజనులకు జరిగేటువంటి అంటరానితనం వగైరాలు అన్నీ కూడ చట్టరీత్యా implement చేయడానికిగానూ వీండ్లకు కేసులు పెట్టడానికి సమర్థత ఉన్నది కాబట్టి ఇది separate చేసి వాండ్లను ఈ ఉద్యోగంలో నియమిస్తారా అని అడుగుతున్నాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO :— దీనికి దానికి ఏమీ సంబంధం లేదు.

*Promotiion of Assistant Inspectors of Fisheries*

288.

* 357 Q: SRI G. NAGESWARA RAO :—Will the Hon. Minister for Agriculture be pleased to state:

(a) the basis on which the Assistant Inspectors of Fisheries are promoted; and

(b) whether any Senior Assistant Inspectors were over-looked in giving promotion?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) Promotion of Assistant Inspectors as Inspectors of Fisheries is based on rule 5 of the Special Rules for the Fisheries Subordinate Service. The post of Inspector of Fisheries is a selection category post and promotion to the post is made on grounds of merit and ability. Seniority being considered only where merit and ability are approximately equal.

(b) Yes, Sir.

SRI G. NAGESWARA RAO :—అధ్యక్షా, Senior Asistant Inspectors ఉన్నపుడు వాండ్లనేమో ప్రమోషన్ చేయడం లేదని గవర్నమెంటుకు appeal పెట్టుకొంటే వాండ్లను promotion చేయమని ఆర్డర్సు ఇచ్చినప్పటికి కూడ ఒక కేసులో promote చేయలేదు. అట్లాగే ఉంచారు. అటువంటిది మీరు ఆలోచిస్తారా ? ఒక senior inspector 55 లో assistant Director గ రెండు నెలలు acting గ నియమించబడి తర్వాత అదే vacancy మరొక సారి వచ్చినపుడు అతనిని నియమించకుండా ఒక junior Inspector ను నియమించారు. ఈ కేసు కూడా మీరు దరియాప్తు చేసిచర్య తీసుకొంటూరా ?

THE HON. SRI K. OBULA REDDI :—అది నా దృష్టిలోనికి తీసుకొని రండి ఆలోచిస్తాను.

*Starting of mursery school teacher training institutions*

289.

* 294 Q: SRI VAVILALA GOPALAKRISHNAYYA:
SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state whether any steps were taken to start nursery school teacher training institutions with nursery school attached as recommended by the Elementary Education Committee?

THE HON. Dr. B. GOPALA REDDI :—The proposal for the opening of Nursery Sections in all the four Government Training Colleges, was examined but was deferred for consideration during 1957-1958.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— కారణం చెప్పుతారండీ ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ఇంకా ఇన్ని మాట్లు చెప్పవలెనా ? ఆర్థిక అభావం.

SRI V. VISWESWARA RAO :—వచ్చే సంవత్సరం ఐనా వాటిని తప్పకుండా open చేయడానికి ఇప్పటినుంచి ప్రాతిపదిక ఏమైనా వేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— అది ఆనాటి Budjet position ను బట్టి ఉంటుంది. 1957-58 లో Part II Scheme లో consider చేస్తాము. అప్పుడు ఎంత deficit ఉంటుందో అంతా గమనించి అప్పుడు ఆలోచించుకోవచ్చు.

SRI T. JIYYAR DASS :— ఈలాంటి Training School open చేయడానికోసమని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 65 వేలు కేటాయించినట్లు Children Welfare Committee of Andhra State కు మీరు ఉత్తరం వ్రాశారు. 1957-58 కైనా సరే. ఈ పెంటపాడు Training School లో open చేయడానికి ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— పెంటపాడులోనా రాజమండ్రిలోనా, కర్నూలులోనా అనే మాట ఇపుడు ఏమిరాదు. 1957-58 లో బడ్జటును బట్టి చూచుకోవలసిఉంటుంది. ప్రణాళికలో ఉన్నది కాబట్టి 65 వేలు తప్పకుండా రెండు అంశాలలో తీసుకోవాలనే మాట ఏమిలేదు. ఆర్థికస్థోమతును బాగుచేసుకొన్నపుడు మనం చేసుకోవలెనేగాని plan లో ఉన్నదంతాకూడా మనం నిర్వహించుకోలేక పోవచ్చును. అని పదే పదే కళావెంకట్రావుగారు చెప్పుతూ ఉన్నారు. గౌరవనీయులైన సభ్యులు ఈ విషయాన్ని గమనించవలెనని కోరుతున్నాను.

SRI T. JIYYAR DASS :— ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఏర్పాటు చేసినటువంటి ప్రణాళికలన్నిటికంటె children's education ఉత్తమోత్తమమైందని దీనికి ప్రాధాన్యం ఇవ్వాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

(No answer.)

SRI VAVILALA GOPALA KRISHNAYYA :— విద్యావిషయంలో standards పడిపోతున్నాయి గనుక వీటిని జాగ్రత్తగా ఆలోచిస్తున్నారు. అందులో Nursery Schools లో నుంచి గనుక standards maintain చేయడానికి ప్రయత్నిస్తే మనకు efficiency బాగా ఉంటుంది. ఆ ఇబ్బందిని సర్దుకోవటానికి క్రిందిపునాది గట్టిచేయటానికి ఇది ప్రధానభాగంగా ఆలోచించి ఏర్పరుస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI :— శ్రీ గోపాలకృష్ణయ్య గారు చెప్పినదానితో ఏకీభవించినప్పటికి కూడ ఆర్థిక అభావం గుర్తుంచుకోవాలి.

*Power looms in the place of Handlooms*

291.

* 553 Q: SRI M. NAGI REDDI :
SRI S. NARAYANAPPA :
SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) whether it is a fact that the Central Government have asked the State Governments to prepare schemes for introducing power looms in the place of handlooms: and

(b) if so, whether the State Government have prepared the scheme and sent it up to the Central Government?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes Sir,

(b) The matter is under consideration of the Government.

(ఎ) అవునండి

(బి) ప్రభుత్వంవారు ఈ విషయం ఆలోచిస్తున్నారు.

SRI V. VESWESWARA RAO:— అధ్యక్షా, గవర్నమెంటు కొత్తగా తీసుకొని వచ్చిన ఈ Power Looms proposal వల్ల hand loom industry కి దెబ్బ తగులుతుంది అని చేనేత పారిశ్రామిక సంఘంవారు ప్రభుత్వానికి represent చేశారా? దానిపైన ప్రభుత్వం యొక్క దృక్పథం ఏమిటి?

THE HON. SRI K. VENKATA RAO:— ప్రభుత్వంవారికి ఏమో నివేదించారు. ఆ విషయమే ఆలోచిస్తున్నారని మనవి.

SRI S. NARAYANAPPA:— ఈ power looms ను cooperative sector లో ఉంచుకోకుండా కేవలం ఇది ప్రత్యేకంగా ఉంచేటట్లు మన ప్రభుత్వం వారు కేంద్రప్రభుత్వానికి శిఫారసు చేస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :— వారు ఒక స్కీము వేశారు. మనకు ఇష్టంఉంటే పుచ్చుకోవచ్చు, లేకపోతే మానివేయవచ్చును, మిగిలిన సలహాలు మనకెందుకు?

SRI M. NAGI REDDI :— ఆంధ్రలో ఎన్ని power looms పెట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది?

THE HON SRI K. VENKATA RAO :— ఇండియా అంతకు కలిపి 35 వేలు. ఆంధ్రకు 3 వేలు ఇస్తామన్నారు. అందులో వర్తమాన సంవత్సరంలో వెయ్యి వచ్చే సంవత్సరంలో రెండు వేలు పెట్టమని, వారి కోరిక. ఇంతాచేసి మనం పుచ్చుకొంటామో లేదో ? ఇంకా నిర్ణయించలేదు.

*Yaw's control in Agency Areas*

292.

* 852-F. Q : SRI P. GUNNAYYA :— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :—

(a) whether the Government are aware that the people in Agency Area of Srikakulam district are suffering a lot from a disease called 'Yaws' and

(b) if so, What are the steps taken by the Government to prevent it ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) Yes, Sir,

(b) "The Government have sanctioned in April, 1956 a scheme for the control of 'Yaws' among the Hill Tribes in the Agency Areas of Srikakulam District and the Scheme has been in operation since 1-5-1956.

(A) తెలుసునండీ.

(B) ప్రభుత్వం ఇప్పుడు ప్రత్యేక సిబ్బందిని వేసి, పాలకొండ, పార్వతీపురం సాలూరు ప్రాంతాలలో Anti-yas Injuctions ను ఇవ్వటానికి కార్యక్రమం జరుగుతోన్నది. పాలకొండ, కురుపాంకలలో కార్యక్రమాలు పూర్తి అయినాయి. పార్వతీపురం, సాలూరులో ప్రస్తుత కార్యక్రమాలు సాగుతున్నాయి.

SRI P. GUNNAYYA :— అధ్యక్షా ! మంత్రిగారు ఈ యాస్ జబ్బుకు Medical శాఖ నుండా, లేకుంటే Health శాఖ నుండా ఈ జబ్బును సంబంధించి నటువంటి injuctions ఇవ్వటం సెలవిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :— Health Department దే.

SRI P. GUNNAYYA :— Health Department ఇచ్చినటువంటి injuctions ఏమీ పని చెయ్యడంలేదని కురుపాం area నుండి, పాలకొండ area లో నుండి చెప్పుతున్నారు. ఆ యాస్ జబ్బేమో కుష్టురోగం కంటె చాలా ముఖ్యమైన జబ్బు. దానివలన కొండజాతులవారు అనేకమంది చచ్చిపోతున్నారు. కాబట్టి

తగుమైనటువంటి మందుని ఆ యాస్‌జబ్బుని మాన్పించటానికి వెంకటరావుగారు పూనుకొంటారా అని మనవి చేస్తున్నాను.

THE HON. SRI K. LATCHANNA :— దీనికి కొత్తరకమైన injection లను కనిపెట్టారు. ఇప్పుడు బాగా తగ్గుతుంది.

SRI S. VEMAYYA :— ఈ యాస్ అనేవ్యాధి క్రింద ఏదైనా ప్రత్యేకమైన Allotment చేశారా? Allot చేస్తే అది ఎంతవరకు ఖర్చు చేయబడింది.

THE HON. SRI G. LATCHANNA :— ప్రత్యేకంగా ఒక Department ను కూడా పెట్టి కొండజాతులకు సహాయం చేద్దామనుకున్నాం ఇది వరకూ దీనికి సరిఅయిన మందులేదు. కొత్తగా కొంతకనిపెట్టారు. దానివల్ల కొంత తగ్గులోనున్నది అని ఇప్పుడు రిపోర్టులు వస్తున్నాయి.

SRI B. APPARAO :— అధ్యక్షా, Servants of India Society వారు ఇప్పుడు Agency ప్రాంతాలలోకి వచ్చి యాస్‌జబ్బుకు ఉచితంగానే చికిత్స చేయడానికి సిద్ధంగా ఉన్నట్లు తెలుస్తున్నది. ప్రభుత్వంవారి దృష్టికి ఇట్లాంటిదేమైనా వచ్చిందా. వస్తే దానిమీద ఏమైనా శ్రద్ధ తీసుకొంటారా ?

THE HON. SRI G. LATCHANNA:— Sevrants of India Society వారి దగ్గరనుంచి మాకేమీ ఉత్తరం రాలేదు. ఎవరైనా ఇప్పుడు ఉచితవైద్యం చేస్తూన్నట్లు యాస్‌కుకూడా కొండలోయల్లో వైద్యం చేస్తాంఅంటే మా అభ్యంతరం ఏమీలేదు.

*Nagarjuna Silpa Kala Peetham*

293.

* 425 Q: SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state:

(a) whether the Government propose to take over the Nagarjuna Silpa Kala Peetham of Macherla;

(b) if not, will the Government consider to give aid for its development; and

(c) whether the Government themselves propose to start one such peetham at Nagarjunakonda?

THE HON. Dr. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) The question of giving aid may be considered if and when an application is received by Government.

(c) There is no such proposal at present.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:— అధ్యక్షా, గుంటూరు జిల్లాబోర్డు ఈ పాఠశాలను తీసుకోవాలని ఆలోచిస్తూ గవర్నమెంటును కూడా అడిగిందని తెలుస్తూంది. గుంటూరు జిల్లాబోర్డు ఇప్పుడు అక్కడ ఉన్నటువంటి కళాపీఠాన్ని తీసుకొని తమ management లోకి తీసుకురావాలని Arts and Crafts రెండూకూడా, క్రాఫ్ట్సు ఎటూ అక్కడఉన్నది గనుక Arts ను కూడా పెట్టుదామని ఆలోచిస్తూ అందుకు Government ను అడిగిందని తెలుస్తున్నది. మీకేమైనా వచ్చిందా? వస్తే ఏదైనా consider చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI:— నాకు ఎరుక ఉన్నంత వరకూ ఏమీ రాలేదు.

STI A. KELESWARA RAO:—ఈపీఠం ఎవరుపెట్టారు? Management ఎట్లు జరుగుచున్నది. దీనిలో నుండేటటువంటి అసలుబోధ, దీని ఉద్దేశాలంతా కూడా Government వారికి తెలుసునా ?

THE HON. Dr. B. GOPALA REDDI:— ఈపీఠం చిత్రకళా పీఠంగా నెలకొల్పబడింది ముందు. శ్రీ గుఱ్ఱం మల్లయ్యగారు వగైరాలంతా కూడా కొన్నాళ్లు దీనిని run చేసినారు. తర్వాత కొంత కాలంగా run కాలేదేమో. Sculpture వగైరాలన్ని నేర్పించడంకోసంగా పెట్టినటువంటి పీఠం.

SRI M. R. APPA RAO :—Govenment Art School ను ఒకటిని పెట్టాలని అనుకుంటున్నారు గదా ? అది పెట్టినట్లు అయితే దాంట్లో ఇదికూడా కరికులంలో ఒక పార్టు అయినట్లు అవుతుంది. అది Arts School ను పెట్టడానికి Government వారు ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— చాలా అవసరమైనటువంటి పెక్కు విషయాలలో ఇదికూడా ఒకటి. కానీ అన్నిటికీ ఒకటే జవాబు - అర్థికఅభావము.

SRI P. SREERAMULU :— సర్వ కళాకోవిదులైన ముఖ్యమంత్రి గారు, ఇదివరకూ proposal లేకపోయినా, నాగార్జునకొండ దగ్గర వారి హయాంలో ప్రత్యేకంగా ఈ పీఠాన్ని నెలకొల్పడానికి మళ్లీ పునః ప్రయత్నిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— పీఠం ఎక్కడ అయినా పెట్టే పని అయితే గుంటూరులోనో, రాజమండ్రిలోనో, బెజవాడలోనో ఎక్కడైనా పెట్టితే మంచిది. కాని, ఎక్కడనో మారుమూలఎవరికీ అందని ప్రదేశంలో పెట్టడం మంచిదికాదేమో. కాని ఇది అంతాకూడా ఆలోచించవలసి ఉంటుంది.

SRI T. JIYYAR DASS :— అధ్యక్షా ! మన పండిట్ జవహర్ లాల్ నెహ్రూగారు ఆ ప్రదేశంలో విజయపురిని కట్టించమన్నారుకదా ? ప్రభుత్వం వారు దానికి పూనుకొంటున్నారు. ఇది మారుమూల కాదు. బహుశా కేంద్ర ప్రదేశం అవుతుంది. అట్టిచోట ఈ కళాక్షేత్రం ఉండటం గురించి ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— విజయపురిలో workers ఇప్పటికే ఉన్నారు. విజయపురి ఇప్పటికే start అయింది. విజయపురిలో Telegraph Office కూడా ప్రారంభం అయింది. మనం ప్రత్యేకంగా నెలకొల్పేదేమీ లేదు. ఎట్లాయినా అక్కడ 30 వేల మందో 40 వేల మందో, workers ఉంటారు. వాళ్లందరికీ ఎక్కడనో ఇండ్లు కట్టించవలసి ఉండింది. ఆ ప్రాంతానికి విజయపురి అనే నామధేయం ఇవ్వబడింది.

SRI M. NAGI REDDI :—నాకుముందే మాట్లాడినటువంటి సభ్యులే మాట్లాడారనుకొండి మారుమూలకాదు అన్నటువంటిది. అందులో ఇప్పుడు కేంద్ర ప్రభుత్వం excavations వాటిల్లోకూడా ఈ నాగార్జున కొండ అది పెట్టుతున్న సందర్భంలో అక్కడ మ్యూజియంను పెట్టడానికి ప్రభుత్వం ఆలోచనలో ఉన్నది. అందువల్ల ఆ మ్యూజియానికి అనుబంధించే ఇది పెట్టడం అనేది. తర్వాత మంత్రి గారు చెప్పుతూ విజయపురి Post Office ను కూడా పెట్టారన్నారు. వారు చూడ లేదేమో. నాగార్జున సాగర్ డామ్ సైటు అని ఒక Post Office పెట్టారు. అందు కని ఒక ప్రశ్నకూడా పంపాను. విజయపురి Post Office గా మార్చటానికి ఇప్పుడుఅయినా ప్రయత్నం చేస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— అది బహుశా వాళ్లకు తెలియక అట్లు చేశారేమో. తర్వాత ఈ విషయం Government దగ్గరకు వచ్చింది. దీనిని ఏమనాలో, దానిని ఏమనాలో అనే దానినిగురించి orders pass చేశాము.

*Development of Hand-made Paper Industry*

295

* 594 Q: SRI M. NAGI REDDI :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

30th September 1956 ]

(a) the amount allotted to Andhra State by the Central Government as loan and as grant for the development of Hand-made Paper Industry in the State; and

(b) the places and how the Government propose to spend that amount?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The Government of India have sanctioned a grant of Rs. 8,250/-and a loan of Rs. 30,750/-for the development of hand made paper industry in this State.

(b) The amount is proposed to be spent for starting a handmade paper unit at the Model Centre for village Industries at Gopannapalem.

(ఎ) ఈ చేతికాగితం తయారీకి Government of India వారు 8,250 రూపాయలు అప్పుక్రిందను, గ్రాంటుక్రింద రు. 3,750 ఇస్తామని నిర్ణయించారు. ఈసొమ్ముతో గోపన్నపాలెంలో మోడల్ సెంటర్ను ఒకటి తయారు చేయడానికి ప్రభుత్వం సంకల్పించింది.

SRI S. VEMAYYA:— ఇది విస్తృతంగా చేయడానికి ఇతర జిల్లాలకు కూడా ఇప్పించడానికి ప్రభుత్వం ఏదైనా పూనుకొంటుందా?

THE HON. SRI K. VENKATA RAO:— ఒకటి జయప్రదంగా జరిగిన దానివలన లాభం ఏర్పడితే ఇతర ప్రదేశాలలో పెట్టాలనే ప్రభుత్వం యొక్క సంకల్పం.

SRI S. VEMAYYA:— Technical గా కావాల్సినట్టువంటి people ను ఈ ప్రభుత్వమే భరిస్తుందా, లేకుంటే industry పెట్టుకొనేటటువంటి వాళ్లే భరించుకోవాలా?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రత్యేకంగా తమంతట తామే పెట్టుకోవాలంటే దానికి Industrial loans వగైరా ఉన్నాయి. అది ప్రభుత్వంవారు పెట్టి technicians ను తయారు చేయుటకు ఉద్దేశింపబడిన కేంద్రం.

*Collections by the District Collector of Anantapur on the occasion of the Governor's visit*

296.

* 761 Q: SRI S. NARAYANAPPA:—Will the Hon. the Chief Minister be pleased to state:

(a) whether the District Collector of Anantapur obtained the permission of Government to make collections on the occasion of the Governor's visit to Anantapur in the month of February 1956;

(b) what is the amount collected in each taluk and by whom it was collected.

(c) what is the amount spent for decorations and dance performances during the visit; and

(d) how much amount was left unspent and how it was spent later?

THE HON. Dr. B. GOPALA REDDI:—

(a) The occasion for the collections was not the Governor's visit. The collections were for two benefit performances in aid of the Lalitha Kala Parishat and certain other institutions got up during the Governor's visit and at which the Governor was present. The omission on the part of the Collector to obtain the prior permission of the Government to associate himself with this cause, has been pointed out to him for his future guidance.

(b) The total amount collected was reported to be Rs. 66,002-4-0. Taluk-wise details are not available with the Government. This amount was collected by members of the Lalitha Kala Parishat and other non-official members including some M. L. As. and some other prominent citizens of Anantapur District.

(c) The amounts spent for dances and decorations etc. is Rs. 6,361-9-6.

(d) Rs. 59,640-10-6.

Donations were made from the above to the following institutions:

| | |
|---|---|
| Lalithakala Parishat, Anantapur, Building Fund. | Rs. 20,000/- |
| The Anantapur Orphanage. | 10,000/ |
| Sri Destitute Home, Dharmavaram. | 5,000/ |
| Sri Saibaba High School, Anantapur. | 5,000/- |
| The Board High School, Penskonda. | 5,000/- |
| | 45,000/- |

Balance viz. Rs. 14,640-10-6 is said to be the reserve fund of Lalitha Kala Parishat to be used for the encouragement of fine arts.

[30th September 1956

SRI S. NARAYANAPPA:— లలితకళా పరిషత్తుకై నిధిని వసూలుచేసే సందర్భంలో Revenue Department కు, Commercial Department వారికి, Co-operative Department వారికి Collector గారు సరైన instructions యివ్వక. పోవడంవల్ల వసూలు సక్రమంగా జరుగకపోవడం, వసూలు అయిన వాటికి సక్రమమైన రశీదు లివ్వకపోవడం మున్నగునవి జరిగాయి. ప్రభుత్వంవారు ఈ విషయమై enquiry చేసి తగిన చర్యలను తీసుకోడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI:— కొంతవరకూ enquiry జరిగినది బహుశా కలెక్టరుగారు తమ నైతికబలమును ఉపయోగించి వుండవచ్చును. గౌ॥ సభ్యులు చెప్పినవన్నీ విచారణ జరిగాయి.

SRI K. VIJAYABHASKARA REDDI:— లలితకళా పరిషత్‌కు డబ్బు వసూలు చేయడానికి Collector గారిని ఎందుకు point out చేయవలసి వచ్చిందో మంత్రిగారు శలవిస్తారా ? ఇందులో Collector గారికి ఏవిధమైన సంబంధం వున్నది ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ప్రత్యక్షంగా సంబంధం లేకపోయినప్పటికిన్నీ పరోక్షంగా సంబంధం వున్నదేమో. అటువంటివాటికి ప్రభుత్వం దగ్గరనుండి permission తీసుకోవాలని future guidance కోసం తెలియపరచ బడింది.

SRI R. B. RAMAKRISHNARAJU :— ఇతర జిల్లాలలో మంచిపనులు చేయుటకుగాను కలెక్టరుగారు తమ నైతిక బలము నుపయోగించుటకు అనుమతి ఇస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— అది పరిస్థితులనుబట్టి వుంటుంది. ఏ సందర్భంలో ఏ ఉద్దేశంతో ఏ artist లను పిలిపించి చేస్తున్నారో మున్నగు విషయాలన్నీ గమనించవలసి వుంటుంది.

SRI N. K. LINGAM :—ఈ ప్రశ్నకు చెప్పిన సమాధానం విన్నతరువాత నాకు ఒక అనుమానం వచ్చింది. ధర్మంగా నెలకొల్పబడిన hostel నుండి కొంత మంది కొన్ని ఇతర సంస్థలలో సభ్యులుగా నియమించారు. అందులో డబ్బువసూలు చేసే పద్ధతికూడా వుంది. ఈ పరస్థితులలో కమిటీ తరఫున డబ్బు వసూలుచేస్తే వారికి ప్రమాదంగా వుంటుంది. కనుక అటువంటి సభ్యులను ఆ కమిటీలనుంచి తీసివేస్తారా ? లేక వారికి డబ్బు వసూలుచేసే అధికారం ఇస్తారా ?

Mr. SPEAKER :—A separate question may be put.

SRI T. JIYYAR DASS :— ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో వుండగా లలితకళలను పోషించుటకు ఒక కమిటీని వేశాము. ఆంధ్ర ప్రభుత్వంకూడ తగిన పరిశోధన చేస్తున్నది. ఈ ప్రభుత్వాలు రెండూ కలిసి చేయలేనట్టి కృషిని ఒక్క Collector గారు చేసినారు. ప్రశంసించతగిన విషయం. ప్రభుత్వం ఆ కలెక్టరుగారికి అభినందన చెప్పేటందుకు ప్రశంసాపత్రం ఇస్తుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ఇది లలితకళల విషయం కాదు. లలితకళలను పోషించాలనే విషయం. ఈ విషయమై ఎవ్వరికీ ఎలాంటి సందేహమూ లేదు. ఈ ప్రభుత్వోద్యోగస్థులు అటువంటి సంస్థలకు డబ్బు వసూలు చేయవచ్చునా చేయకూడదా అనేది సమస్య. అంతేకాని లలితకళలను ఉద్ధరించ కూడదు ; దానికి కలెక్టరు సహాయం చేయకూడదని కాదు. ధనం వసూలు చేయడంలో ప్రత్యక్షంగా జోక్యం కల్గించుకొని వసూలు చేయవచ్చునా ? లేదా ? అనేవిషయం ప్రభుత్వంవారు ఇదివరకే G. O. issue చేసినారు.

SRI A. KALESWARA RAO:— ఇదివరకు ఉమ్మడి మదరాసు ప్రభుత్వంలో Tiruvuru Basic Training School కు ఉద్యోగస్తులు డబ్బు వసూలు చేయవచ్చని గోపాలరెడ్డిగారు Finance Minister గా వున్న time లో ఒక G. O. issue చేశారు. "ఉద్యోగస్తులు ఇటువంటివాటిలో జోక్యం కల్గచేసుకొని డబ్బు వసూలు చేయవచ్చును" అని permission యిచ్చినపుడు వసూలైన ధనం ఎట్లా జమకట్టినారు ? ఎంత ఖర్చు అయినది? అనేవిషయాలను ప్రభుత్వంవారు strict గా తనిఖీ చేస్తారా ? లేక permission ఇచ్చి ఊరుకుంటారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :— ప్రతి individual case లోనూ ఉద్యోగులు ప్రభుత్వం దగ్గరనుండి permission కోరవలసి యున్నది. T. B. Association లో Colleetors ను associate చేస్తూంటాము. కాని ఇతర లలితకళలకు, Schools కూ డబ్బు వసూలు చేయవలసివచ్చినపుడు వారు తప్పకుండా ప్రభుత్వంయొక్క అనుమతి తీసుకోవాలి. అనుమతి పొందకుండా general గా చేయడానికి వీలులేదు. అనుమతి యిచ్చినప్పుడు ఆ accounts అన్నీ చూచుటకు ప్రభుత్వంవారు ప్రయత్నంచేస్తారు.

SRI V. VISWESWARARAO: — లలితకళాపరిషత్తుకూ, కలెక్టరుకూ ఉండేసంబంధం ఏమిటి ? కలెక్టరుగారు అందులో సభ్యులా ? వీరు ఆ సంస్థతరఫున వసూలుచేసిన డబ్బంతా ఇతరవాటికి పంచిపెట్టినట్లు చెపుతున్నారు. అట్లాఎందుకు పంచిపెట్టవలసివచ్చింది?

THE HON. Dr. B. GOPALA REDDI :— కమీటీవారంతా కలిసి ఒక school యిచ్చారు. వేమారెడ్డిగారు ఆకమిటీలో వున్నారనుకొంటాను. నాకు సరిగా తెలియదు. ఆ కమిటీలో కొంతమంది M. L. A. లున్నట్లు తెలుస్తున్నది. కలెక్టరుగారికి ప్రశిడెంటుగానో లేక ఏదోకొంత అధికారంవుంది.

*Settlement of Chakirala Village*

363.

* 852-K Q: SRI G. YELLAMANDA REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether the Settlement of Chakirala Village, Kanigiri Taluk, Nellore District was completed;

(b) if so, whether Kothakunta of the same village was classified as a Poramboke;

(c) if so, when; and

(d) if not, why not?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The Settlement of Chakirala village, Kanigiri Taluk Nellore District is not yet complete, but only the settlement field work in the village has been completed.

(b) & (c) :—Kothakunta in S. No. 595 of Chakirala village was treated as a Poramboke when the village was finalised by the Assistant Settlement Officer, Nellore and this classification was also confirmed by the Settlement officer, Nellore.

(d) Does not arise.

SRI G. YELLAMANDA REDDI :—Settlement Officer ను confirm చేస్తామని మంత్రిగారు చెబుతున్నారు. మళ్లా appeal చేసుకోడానికి అధికారం వున్నదా ?

Mr. SPEAKER :— There is a procedure for it.

THE HON. SRI K. CHANDRAMOULI :— దానికి ఒక procedure వున్నది. దాని ప్రకారరే చెయ్యాలి.

*Karlapalem N. E. S. Block in Guntur District*

364.

* 906 Q: SRI B. V. SIVAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether a Block Development Committee was constituted for the Karlapalem N. E. S. Block in Guntur District;

(b) whether the proceedings of the District Collector, Gnntur constituting the said committee were stayed; and

(c) if so, the reasons, therefor?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Not yet, Sir.

(b) & (c) The reconstitution of the comittee has to be referred as the Block has since been realigned by excluding some of the villages of Kakimanu firka and including the firkas of Bapatla (including Baptla Municipality) and Yazali in full. The members to be cooped should be with regard to the actual jurisdiction of the realigned block and not the old block. The committee will be reconstituted as early as possible.

(ఎ) కాను.

(బి) మొట్టమొదటి Block ఒక రూపంలో తయారైనది. తరువాత కొన్ని గ్రామాలను ఇటూ, అటూ మార్చవలసి వచ్చినది. అందువల్ల దీనికి కమిటీ వేయడం ఇంతవరకూ తటస్థించలేదు. త్వరలో కమిటీ appoint కాబోతున్నది.

SRI B V. SIVAIAH :—మొదట ఈ Block ను యిచ్చినప్పుడు తహశీల్దారిగారికి, R. D. O. కు కొన్ని పేరులు పంపినాము. ఆ పేరులను కలెక్టరుగారు approve చేసిన తరువాత నిలిపివేయడం జరిగిందా? లేదా?

THE HON. SRI K. VENKATA RAO :—జరిగింది.

SRI B. V. SIVAIAH :— అల్లా జరుగుటకు కారణమేమిటి?

THE HON. SRI K. VENKATA RAO :— Criminal Cases లో వున్నవారిని Members గా శిఫార్సు చేయడమే కారణం.

SRI B. RAMA REDDI :—Development Committee లో సభ్యులను వేసేటప్పుడు Development Officers తోగాని, శాసన సభ్యులతోగాని, ఊరిలోని పెద్దమనుష్యులతోగాని సంప్రదించకుండా వేయుటవలన శ్రద్ధలేనివారు కమిటీలో నియమించబడుతున్నారు. అందువల్ల ఈ కమిటీ సరిగా function చేయుటలేదు. కొంతమందితో సంప్రదించిన తరువాత కమిటీలో appoint చేసుకోవలసినదిగా కలెక్టరుగారికి ఆదేశమిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :— అట్లా చేయడానికి వీలులేదు.

SRI B. V. SIVAIAH :— మొదట నియమించిన కమిటీని నిలుపుదల చేయడం జరిగిందన్నారు. క్రిమినల్ కేసులలోవున్న కొంతమందిని సభ్యులుగా వేశారంటున్నారు. అట్లా వేసినవారెవరు ? వారికి కావలసిన కొంతమందిని ఈ కమిటీలో వేయలేదనే కారణంచేత కమిటీని నిపుదలచేసినట్లు ప్రజలలో అపోహ వున్నది. అది ఎంతవరకూ యదార్థం ?

THE HON. SRI K. VENKATA RAO :—రెండవ భాగం యదార్థంకాదు. అసలు కాకిలేరు ఎక్కడ ఉన్నదో, యాజలి ఎక్కడ ఉన్నదో నాకు జ్ఞాపకం లేదు. 10, 15 సం. ల నుంచి అటువైపు నేను వెళ్ళలేదు. కాబట్టి మెంబర్లుగా ఎవరున్నారనే విషయంలో మంత్రిగార్కి ఏ విధమైన సంబంధము లేదు. Members ను appoint చేసే అధికారం జిల్లా కలెక్టరుకు ఇవ్వబడింది. ప్రభుత్వంవారు జోక్యం కలుగజేసుకొనుట లేదు. కాని ప్రత్యేకమైన పరిస్థితులలో ఒక పేరును పొరపాటు పంపించామని కలెక్టరుగారు అనుటవల్ల దానిని ఆపుచేయకుండా వుంచుటకు వీలులేదు. ఈ సభలో అటువంటివారి పేరు చెప్పడం న్యాయం కాదు.

SRI P. SRIRAMULU :—క్రిమినల్ కేసులలో వున్నవారిని సభ్యులుగా వేయుటవలన ఆ కమిటీని నిలుపు చేశామని మంత్రిగారన్నారు. వారు నిజంగా క్రిమినల్ కేసులలో వున్నారా ? వారికి ఖాయంగా శిక్షగాని, జరిమానాగాని వేయడం మున్నగు పరిష్కారాలైన తరువాత కేసులను stay చేశారా ?

THE HON. K. VENKATA RAO :—Criminal Casesలో వున్నారు వారి పాత చరిత్ర కూడా మంచిదిగాలేదు.

SRI V. VISWESWARA RAO :—ఈ కమిటీలో సభ్యులను వేసేటప్పుడు వారి పాత చరిత్ర పరిశీలిస్తామని మంత్రిగారు చెబుతున్నారు. పంచాయితీ బోర్డు ప్రశిడెంటుగా వుండి సక్రమంగా నిర్వహించ లేదనే కారణం చేత ఆపదవి నుంచి తొలగించ బడిన వారితో కూడ ఈ కమిటీలో investigation జరుగుతోంది. అటువంటివారి మీద చర్య తీసుకుంటారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాకుఅట్లాటి పేరు తెలిస్తే, ప్రభుత్వానికి అధికారం వున్నట్లయితే తక్షణం తొలగిస్తారు.

SRI G. SURYANARAYANA :— కొన్ని జిల్లాలలో 2, 3 నెలలకు ఒకసారి collectors transfer అవుతున్నారు. మా జిల్లాకు 2 నెలలకు ఒక్కొక్క కలెక్టరుగారు వస్తుంటారు. ఇటువంటి కలెక్టరులకు మెంబరులను appoint చేసే అధికారం యిస్తే వారికి ఏమి తెలుస్తుంది ? అక్కడ ఉన్న M. L. A. లనో లేక

(c) The District Panchayat Officer has been directed not to hold the elections of the Panchayat, if the date has not yet been notified.

[Note: An asterisk* at the commencement of a speech indicates revision by the Member.]

## II POINT OF INFORMATION RE: HALF HOUR DEBATE ON PRESS LEAKAGE.

Mr. SPEAKER :—Sri Pillalamarri Venkateswarlu asks for half hour debate on the press leakage. We have gathered from the answers that an enquiry is going on. Why should we prejudice the enquiry by having a discussion here?

SRI PILLALAMARRI VENKATESWARLU :—Enquiry ను prejudice చేయటానికి కాదండి. Enquiry బాగా జరగటానికి. యిప్పుడు యీ debate మూలముగా యింకా ఎక్కువగా ఉపయోగముగా ఉంటుందని half-an-hour debate కావాలని అడుగుతున్నాను. అదికాకుండా యిది చాలా serious matter. ఈసారి Assembly తో prorogue చేయబోతున్నారు. ఆ తరువాత చాలా పరిణామాలకు దారితీయబోతున్నది. Government Press Superintendent మీద చాలా allegations ఉన్నవి. ఆయన మీద చాలా charges pending గా ఉన్నవి. Enquiry యింకా పూర్తి కాలేదు. పూర్తిఅవుతుందనే నమ్మకముకూడా లేదు. పోనీ, కనీసము ఆయనను ఆపదవిలోనుంచి తొలగించి యింకొక డిపార్టు మెంటులో వేసి ఉంచుతామని అంటేకూడ మాకేమీ అభ్యంతరము లేదు. ఆయనమీద ఉన్న allegations చాలా serious వి కాబట్టి, యిప్పుడు యీ విషయములో debate లేకుండాచేస్తే, చాలా చిక్కువస్తుంది గనుక, మాకు తెలిసిన information అంతా మేము మీద్వారా తెలియపరచదలచాము. ఆ information అయినా మీద్వారా ప్రభుత్వానికి అందజేస్తే, enquiry కి helpful గా ఉంటుంది. Enquiry తేలికగా పూర్తిఅయ్యే అవకాశములు ఉంటాయి. ఇక్కడ ఇంతమంది M. L. A. లు చెబుతున్నారు కాబట్టి, ఆయనను అక్కడినుంచి తొలగించటానికైనా అవకాశము ఉంటుంద కాబట్టి, half-an-hour debate కు అవకాశము యివ్వాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :—No. No. No debate now.

THE HON. Dr. B. GOPALA REDDI :—It is not in public interest to discuss any thing about this matter here when an enquiry is pending. అని నేను ఒకప్రక్కన చెబుతూంటే, యింకా half-an-hour debate కు

అవకాశము ఇవ్వండి, మంత్రిగారు దీనికి సమాధానము చెప్పాలని కోరడము సబబు కాదు. As the Hon. Speaker said, it will prejudice the entire enquiry that is pending now.

## III ADJOURNMENT MOTION RE: RETRENCHMENT OF ELEMENTARY SCHOOL TEACHERS IN ANDHRA.

Mr. SPEAKER :—There are two adjournment motions, one by Sri Vavilala Gopalakrishnayya and the other by Sri G. Yellamanda Reddi with regard to the retrenchment of elementary school teachers in Andhra. The two motions relate to the same subject. It does not require any speech. The Hon. Chief Minister is going to make a statement.

THE HON. Dr. B. GOPALA REDDI :—దీని విషయములో చాలా మెమొరాండములు వచ్చినవి. నిన్ననో మొన్ననో ఒకేసారిగా అయిదు, ఆరు వందల టెలిగ్రాములుకూడ వచ్చినవి. అవి అన్నీ బహుశ యల్లమందారెడ్డిగారే చేయించారేమో తెలియదు. ఇన్ని టెలిగ్రాములవల్ల కేంద్ర ప్రభుత్వమువారికి చాలా లాభము వచ్చిఉంటుంది. అందుకు సంతోషము. ఈ విషయములో యిటీవలనే ఒక ఆర్డరుకూడ పంపించాము. మూడు నెలల నోటీసు యిచ్చి తీసి వేయమని చెప్పాము. ఆ విధముగా నోటీసు యివ్వడమైంది. ఆ స్కూలు యొక్క strength యీపశ్చాత్తమైనా వృద్ధిఅయితే, మీరు చర్య తీసుకోవద్దు అని యిటీవలనే ఆర్డరు పంపించాము. ఏమైనప్పటికినీ. యీ విషయములో ప్రభుత్వము సమగ్రమైన ఆలోచనచేస్తున్నది. ఆ టీచర్ల నందరినీ పంపి వేయాలన్న ఉద్దేశ్యము ప్రభుత్వానికి లేదు. ఆ స్కూలు యొక్క strength వృద్ధిచేయటానికి టీచర్లందరూకూడ ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాము. దీ వల్ల టీచర్లకు ఆందోళన అవసరములేదు.

SRI R. B. RAMAKRISHNA RAJU:— ఈమధ్య గుంటూరులో ఒక సమావేశము జరిగింది. ఈ టీచర్లందరూపడే బాధల్లా ఏమిటంటే, ముందుగా క్రమమైన నోటీసు యివ్వకుండా, ఉన్నది ఉన్నట్లుగా ఒక్కసారిగా చేసినందువల్ల చాలామంది వెళ్లిపోవడము జరుగుతున్నది. అందువల్లనే వాళ్లందరు బాధ పడుతున్నారు.

Mr. SPEAKER:— **They have got three months notice.**

SRI R. B RAMAKRISHNA RAJU:— కాబట్టి వారు ముందుగా నోటీసు యివ్వమని అడిగారు. ఆ ప్రకారం యేమైనా నోటీసు యిచ్చారా? నోటీసు యిచ్చి అమలు జరిపితే బాగా ఉంటుంది. కాబట్టి ప్రభుత్వము ఆవిధంగా చేస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI :— ఆ స్కూలులో యీషన్మాత్రమైనా అభివృద్ధి కనబడితే, చర్య తీసుకోవడములేదు అని చెప్పాము. సెప్టెంబరు ఆఖరుతో నోటీసు టైము అయిపోతుంది. అవసరమైతే Director of Public Instruction తో యీదినమే contact చేసి కొంతవరకైనా టైము పొడిగించడానికి ప్రయత్నిస్తాము.

SRI V. VESWESWARA RAO :— ఈ శాసనసభ జరిగేటప్పుడు Elementary School Teachers నుంచి తీసివేయటానికి చర్య తీసుకోము, యిక ముందుమాత్రము యీ స్కూల్సు పెట్టటానికి పూనుకోము, యీ basis మీదనే యీ విధానము అమలు జరుపుతాము; అనే మాటగా ముఖ్యమంత్రిగారు, యిప్పుడే కాకుండా, గత సమావేశము జరిగేటప్పుడుకూడ సూత్రముగా చెప్పారు. కాబట్టి ఆ వాగ్దానాన్ని పురస్కరించుకుని, దీనిని అమలు జరపటానికి ప్రయత్నించమని కోరుతున్నాము. స్కూలును అభివృద్ధి చేయటానికి యేమీ అభ్యంతరము లేదుకాని, వారందరినీ తీసివేయాలనే దృష్టితో ఆ ఆర్డరు అమలుజరపకుండా చేయాలని మంత్రిగారిని కోరుతున్నాము.

THE HON. Dr. B. GOPALA REDDI :— నేను చెప్పేదానికి, విశ్వేశ్వరరావుగారు కొద్దితేడాతో చెబుతున్నారు. వారిని తీసివేయకుండానే ప్రయత్నిస్తామని చెప్పాను. కాని ఎవ్వరినీకూడ తీసివేయమనే హామీమాత్రము యివ్వలేను. ఏమైనప్పటికీ, యీ విషయములో కొంతసానుభూతితోనే అన్ని విషయాలు పరిశీలించి చేస్తాము. అందుకనే ఆ ఆర్డరు వేసిందికూడా. రామకృష్ణరాజుగారు కోరినట్లు, టైముమాత్రము యింకా కొంత పొడిగించటానికి ప్రయత్నిస్తాము. ఆ ఉద్దేశ్యముతోనే ఆ జి. ఓ ను కూడ వేయడము జరిగింది.

SRI G. YELLAMANDA REDDI :—ఆ టీచర్లనందరిని అక్టోబరు ఒకటవ తేదిని relieve చేస్తామని నోటీసులు serve చేస్తున్నారు. అయితే ముఖ్యమంత్రి గారు చెప్పినట్లు time extend చేయబోతారని తెలుస్తున్నది కాబట్టి దానివల్ల విద్యార్థులు ఎక్కువ చేర్చుకోటానికి అవకాశము యిస్తున్నారు గనుక దానివల్ల వారిని వెంటనే తొలగించరని తెలుతున్నది.

THE HON. Dr. B. GOPALA REDDI :—ఈ దినమే Director of Public Instruction ను contact చేసి, యీ విషయములో ఏమి చేయుటానికి వీలు అవుతుందో, ఏమిచేస్తే బాగా ఉంటుందో, వారితో సంప్రదించి, సానుభూతితో ఆలోచించి చేస్తాము.

SRI PILLALAMARRI VENKTESWARLU :—ఇది చాలా serious matter. అక్టోబరు ఒకటవ తేదిన సుమారు ఆరువేలమంది టీచర్లను తీసి వేయబోతున్నారు. అందువల్ల యిది చాలా serious matter అని అంటున్నాను. కాబట్టి Director తో వెంటనే సంప్రదించి, యిప్పుడు ప్రభుత్వము యిచ్చిన ఆర్డరును ప్రస్తుతము వెంటనే stay చేయమని ఆర్డరును పంపకపోతే, సుమారు ఆరువేలమంది అక్టోబరు ఒకటవతేదికి నిరుద్యోగులు కాబోతారు. అందువల్ల యీ సంగతి ముఖ్యమంత్రి గారు దృష్టిలో పెట్టుకుని Director of Public Instruction ను వెంటనే contact చేయమని కోరుతున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI :—అది సరే, టీచర్లలో కొంతమంది retrench అయితేమాత్రము కొంప మునిగిపోయేది ఏమిఉంది లెండి. ప్రభుత్వానికి డబ్బు కూడ మిగులుతుంది. ఏమైనప్పటికినీ ఈ విషయము మాత్రము సానుభూతితోనే ఆలోచిస్తాము. అయినా, ఎవ్వరిని తీసివేయకూడదు, ఎక్కడ ఉన్నవారిని అక్కడనే ఉంచాలని కోరడము మాత్రము సాధ్యముయ్యే పనియేనా ?

*(2) Carrying Liquor in A. D. V. 420 of the Social Welfare Department*

Mr. SPEAKER :—There is another motion given notice of by Sri E. Nagayya and it is as follows:

"విశాఖ పట్టణం జిల్లా Social Welfare Department వారి Project Implementation Committee Convener గారు వారికి ఇవ్వబడిన A. D. V. 420 Jeep Car ద్వారా సారాడబ్బాలను చేరవేస్తూ ఉండగా నబ్బవరం పోలీసు స్టేషను సమీపమున గుల్లపల్లి గ్రామం దగ్గర గ్రామస్థులు 16 - 9 - 56 తేది రాత్రి 2 గంటలకు, 16 డబ్బాల సారాయిని పట్టుకొనిన సందర్భముగా Social Welfare Organisation లో పెన్చు పెరిగి వెల్లివిరియుచున్న అవినీతిని చర్చించుటకుగాను ఈ సభను వాయిదా చేయుడమైనది"

I think it is better you call the attention of the Hon. Minister if there is really such a serious irregulartiy as this about prohibition.

[30th September 1956

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈ విషయము ప్రభుత్వముయొక్క దృష్టికి తీసుకునిరావడము జరిగింది. ప్రభుత్వము యీ విషయములో తప్పకుండా విచారణచేసి, దీనికి responsible ఎవరో, ఆ ఆఫీసరు మీద తీవ్రమైనచర్య తీసుకొనబడుతుందని సభవారికి మనవి చేస్తున్నాను.

SRI E. NAGAYYA :— ఈ Jeep car మీద నాలుగైదు నెలలనుండి సారా చేరవేస్తున్నారు.

Mr. SPEAKER :— I think it is pending enquiry. I think it is subjudice. ఈవిషయాన్ని పరిశీలిస్తున్నామన్నారు మంత్రిగారు. కోర్టులోవున్నది మనము చర్చించడానికివీలులేదు. కనుక నేను ఈతీర్మానాన్ని rule out చేస్తున్నాను. I rule out the adjournment motion.

## IV. GOVERNMENT MOTION RE : RATIFICATION OF THE AMENDMENTS PROPOSED TO BE MADE TO THE COSTITUTION OF INDIA BY THE CONSTITUTION (SEVENTH AMENDMENT) BILL, 1956.

THE HON. Dr. B. GOPALA REDDI :— I move Sir:

"This House ratifies the amendments proposed to be made to the Constitution of India by the Constitution (Seventh Amendment) Bill, 1956 as passed by the two Houses of Parliament."

పోయిన సంవత్సరం సెప్టెంబరు పదవతేదీనాడు కాబోలు ఫజలు ఆలీ కమీషను రిపోర్టు ప్రకటించడము, ఆనాటినుంచి దేశములో ఉద్రిక్త వాతావరణం కొన్ని ప్రాంతాలలో చెలరేగడము మనమందరమూ చూచినాము. తరువాత అనేక అవరోధములను దాటుకుంటూ జాయింటు సెలక్టు కమిటీవారు చేసిన సిఫార్సులు పార్లమెంటులోను, రాజ్యసభలోను చర్చలుజరపడము ఈప్రొపోజల్సును ఆమోదించడము దానికి అనుగుణముగా సవరణలు జరగడము మనకు విదితమైన విషయము. దానిని ఈనాడు మనము ఆమోదించవలసిఉన్నది. పార్లమెంటులో కాన్‌స్టిట్యూషనల్ అమెండుమెంట్లు చేసినా ప్రాంతీయ శాసనసభలు వగమైనా వాటిని ఆమోదించనపుడు అవి సక్రమము అవుతాయి. అప్పుడు పార్లమెంటు ప్యాసుచేసిన తరువాతకాని చట్టముకాదు. ఈ రాజ్యాంగచట్ట సవరణలకు అక్టోబరు 15 వ తేది లోపున రాష్ట్రశాసనసభలు వాటి ఆమోదం తెలుపడవలెను అని ఇండియా గవర్నమెంటువారు అడిగినారు. దాని ప్రకార

ముగా ఈ తీర్మానము శాసనసభలో ప్రవేశపెట్టడమైనది. దాని వివరములు తెలిసినవే. ఇదిగాక పెద్ద అడ్మినిస్ట్రేటివ్ మార్పు తీసుకొనిరాబడుతున్నాయి. ఏనాటినుంచో కర్నాటకజిల్లాలు బొంబాయి రాష్ట్రానికి చేరి ఉండేవి. కాని ఈనాడు కర్నాటకజిల్లాలు బొంబాయినుండి విడిపోయి మైసూరు రాష్ట్రములో చేరుతూఉన్నవి. అట్లాగనే సౌరాష్ట్ర, కచ్చి ప్రాంతాలు బొంబాయికి సంబంధం లేకుండా ఉండేవి. ఈనాడు బొంబాయి రాష్ట్రములో అంతర్భాగము అయి బొంబాయి బైలింగ్యుయల్ స్టేటులో భాగములు కాబోతూ ఉన్నవి బొంబాయి లోని కొందరు, హైదరాబాదులోని కొందరు, కన్నడిగలు ఈనాడు ఒక రాష్ట్రము క్రింద మైసూరురాష్ట్రము అనే పేరుతో నవంబరు ఒకటవతేదీని రాబోతున్నారు. అట్లాగుననే మలబారుజిల్లా ట్రావన్‌కూరు - కొచ్చినుకు సంబంధం లేనిది ఈనాడు కేరళక్రిందకు రాబోతూ ఉన్నది. ఇక ట్రావన్‌కూరులోని కొన్ని భాగములు మద్రాసుకు రావడము, తరువాత మనకు సంబంధించినంతవరకు ఏనాడో వీడి పోయిన తెలంగాణాజిల్లాలు రాయలసీమ, సర్కారుజిల్లాలు అన్నీ ఆంధ్రప్రదేశ్ కాబోతూ ఉన్నవి. ఇక ఉత్కళకు సంబంధించినంతవరకు మనకు రావలసిన భాగములు రాలేదు. బీహారుకు రావలసిన భాగములు వారికి రాలేదు అని ఆగ్రహపడుతున్నారు. బెంగాలు, బీహారుల మధ్య కొంత మార్పు జరుగుతుంది. ఇవన్నీ మొత్తంమీద భాషాప్రయుక్త రాష్ట్రాలు అనవచ్చును. బొంబాయికి ఎక్కడో ఉన్న ప్రాంతాలను కలిపి బైలింగువలు బొంబాయి నిర్మాణం జరుగుతూ ఉన్నది. ఈ తీర్మానములో విషయాలు ఎక్కువగా సరిహద్దుల మార్పులకు సంబంధించినవి. వాటికి అనుగుణ్యముగా రాష్ట్రాల సంఖ్య నిర్ణయించుకున్నారు. తరువాత (A) (B) (C) రాష్ట్రాలు లేకుండా అన్నీ ఒక పద్ధతిక్రింద రావడము ఒక ముఖ్య విషయము. సిమ్లా, మణిపూరులు Union ప్రాంతాలక్రిందకు రావడము జరుగుతోంది.

ఇంతకుముందు ఒక్కొక్క రాష్ట్రానికి ఒక Constitutional Governor ఉండవలెనని ఉన్నది. ఈ తీర్మానముప్రకారము అవసరముఅయితే ఒక గవర్నరును రెండుప్రాంతాలకుకలిపి నియమించవచ్చును. 'Appointment of a Governor for two or more States' చెయ్యవచ్చును, అదే విధముగా ఒక State కు, ఒక Union ప్రాంతానికి ఒకేఒక గవర్నరును నియమించే అధికారాన్ని ప్రభుత్వంవారు తీసుకొంటున్నారు. ఆ మాదిరిగా రెండుప్రాంతాలకు ఒక గవర్నరు అయినపుడు వారిజీతాలు ఏ విధముగా విభక్తము చేయవలెనో చర్చించారు.

Dr. B, Gopala Reddi] [30th September 1956

Co (9) లో అసెంబ్లీలలో ఉన్న strength కూడా మారుస్తున్నారు. Legislative Councils కు వచ్చినప్పుడు ఇంతకుముందు అసెంబ్లీ strength లో ¼ అని ఉండేది. కాని దీనిప్రకారము ⅓ తీసుకోవచ్చును. ఆంధ్రప్రదేశ్‌కు కౌన్సిలు పెట్టుకుంటే ఇప్పుడుఉండే 75 కు బదులు 100 చేసుకోవచ్చును.

ఇక హైకోర్టు జడ్జీలకు సంబంధించినంతవరకూ హైకోర్టు జడ్జీలు పదవినుంచి విరమించినతరువాత ఇంకొక హైకోర్టులో గాని, Supreme Court లో గాని practice చెయ్యవచ్చును. వారు ఎక్కడ పనిచేసినారో అక్కడతప్ప ఇంకొకచోట Practice చెయ్యవచ్చును.

ఒక హైకోర్టునుంచి ఇంకొక హైకోర్టుకు మార్చినపుడు allowance ఇవ్వాలని Constitution లో ఉంది. ఈనాడు అది తీసేశారు. ఒక హైకోర్టుజడ్జిని సుప్రీముకోర్టువారి ఆమోదముతో కేంద్రప్రభుత్వంవారు transfer చేస్తే ఎక్కువ వేతనం లేకుండా ఆ transfer చేసే అధికారం కేంద్ర ప్రభుత్వం తీసుకొంటూఉంది..

అంతేకాక మన ప్రత్యేకరాష్ట్రానికి ఒక హైకోర్టు ఉండాలని ఉన్నది. ఈచట్టం క్రింద రెండురాష్ట్రాలకు ఒకేహైకోర్టు పెట్టడానికిగాని, లేక ఒకరాష్ట్రానికి union territory కి కలిపికొని ఒకేహైకోర్టును పెట్టే అధికారాన్ని తీసుకుంటున్నారు.

"The Bill introduces a provision in the Constitution for the appointment by the President of Additional Judges to clear of arrears and for the appointment of acting Judges in temporary vacancies. If such appointments of Additional Judges and acting Judges would involve other modifications in the order fixing the maximum number of Judges for each court, the proviso to Article 216 which makes it necessary for the President to fix the maximum by an order, has been omitted."

ఇది చాలా ముఖ్యమైనవిషయం.

New Article 258-A inserted by the Bill enables the State Government to entrust State functions to the Central Government or its Offieers in relation to any matter to which the executive power of the State extends."

"The Bill introduces a new provision which is designed to implement one of the State Reorganisation Commission's recommendations regarding the safeguards for linguistic minorities in the States after reorganisation. The Bill also makes a provision for appointment by the President of Special Officers for linguistic minorities"

ఈవిషయంలో మనకు కొన్ని ఇబ్బందులున్నాయి. తిరుత్తనిప్రాంతంలో తమిళులకుకూడా కొన్నిఇబ్బందులుండవచ్చు. ఇటువంటివారందరికి దీనివల్ల సంరక్షణ కల్పించబడింది. పర్లాకిమిడిలోను బళ్లారిలోను ఇంకా ఇతరచోట్ల ఉండే తెలుగుప్రజలకు రక్షణకల్పించే అవకాశం కల్పించబడింది. ఇంతేకాక ఆంధ్ర ప్రదేశ్, పంజాబులకు సంబంధించినంత వరకు regional committees appoint చేయడానికి అధికారాలు తీసుకుంటున్నారు. దీనికి సంబంధించిన regulations చేయడానికికూడా అధికారాలు కేంద్ర ప్రభుత్వంవారు తీసుకుంటున్నారు. కడపటి clause మనకు సంబంధించినది మన అసెంబ్లీయొక్క ఆయుర్దాయం 5 సంవత్సరముల 6 నెలలు పొడిగించినారు.

"The Bill makes a special provision as to the duration on the Andhra Pradesh Legislative Assembly and extends the life of the Assembly as reconstituted under the State Reorganisation Act 1956 untill expiry of 5 years after the re-election of the Telangana Members."

దీనిని పార్లమెంటువారు ఆమోదించి యున్నారు. దీనిని మనం ఆమోదించవలసియున్నది. ఇవి అన్నీ పార్లమెంటులో దీర్ఘచర్చల అనంతరం ఆమోదించబడియున్నవి. ఈవిషయాలు ఇతరచోట్లకూడా చర్చించబడినాయి Constitutional గా మనం చేయతగినది ఏమీలేదు. Amendments పెట్టడానికికూడా వీలులేదు. Ratify చేయవలసిందేతప్ప మరొకటి లేదు అనుకుంటాను. ఇది ప్రధానమైన తీర్మానం. ఎన్నినాళ్ళనుంచో విడిపోయిన సోదరులు తిరిగి కలవడానికి అవకాశం కల్పిస్తున్న బిల్లు ఇది. దేశంలో ఏర్పడిన ఉద్రిక్త వాతావరణంపోయి శాంతి వాతావరణం ఏర్పడుతోంది. నవంబరు 1 తరువాత ఏర్పడే రాష్ట్రంలో ప్రశాంతంగా ప్రజాస్వామిక పరిపాలన ఏర్పడి పరిపాలన చేయగలవని ఆశిస్తున్నాను.

MR. SPEAKER:- Motion moved:

"This House ratifies the amendments proposed to be made to the Constitution of India by the Constitution (Seventh Amendment) Bill, 1956 as passed by the two Houses of Parliament."

Sri Vavila Gopalakrishnayya wants to move an amendment, but before you read your amendment. I would like to know whether it is an amendment to the resolution or is an amendment to the Constitution itself.

561 RATIFICATION OF THE AMENDMENTS PROPOSED TO BE MADE TO THE CONSTITUTION OF INDIA BY THE CONSTITUTION (SEVENTH AMENDMENT) BILL, 1956

30th September 1956]

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా ! ఇతర రాష్ట్రాలుకూడా దీనిని ఆమోదించాలికదా అని మీరు అంటున్నారు. అదిసరే, మనం ఇచ్చే suggestions తో ratify చేస్తే బాగుంటుంది అని decline చేసే ప్రశ్నలేదనుకోండి. దీనిని Constitution కు amendment గా కాకుండా Leader of the House తెచ్చిన తీర్మానానికి add చేసే విధంగా తీసుకోవాలని కోరుతున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI :— ఇటువంటి దానిని non-official day నాడు చర్చిస్తే బాగుంటుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—నా సవరణను చదువగోరుతాను.

Mr. SPEAKER :—It was already moved by you once in this House for appointment of a Boundry Commission in respect of certain areas which we are claiming. It does not require reading. If the amendment is relevant, we will consider and will read it and take it. But I want you to satisfy me whether your amendment is an amendment to the resolution of the Hon. Chief Minister or is an amendment to the Constitution itself.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ప్రభుత్వతీర్మానానికి సవరణ.

Mr. SPEAKER :—Section 368 of the Constitution reads:

"The amendment shall require to be ratified by the Legislatures of not less than one half of the States specified in part A or B."

The amendment as enacted by the Parliament has got to be ratified by the states. Can we make a qualified ratification.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మనకు న్యాయంగా రావలసిన ప్రాంతాలను రాబట్టుకోవడమే నా ఉద్దేశం.

Mr. SPEAKER :—We quite understand your good intentions and your anxiety to acquire some more property for Andhra.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—It is not acquiring Sir.

Mr. SPEAKER :—It is recovering.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—తెలుగు ప్రాంతాలు మనకు రావాలనే నా కోరిక.

Mr. SPEAKER :—We are now acting under Article 368 of the Constitution. It is clearly defined that we should only ratify or reject. Under Section 368 we cannot make any request to the President. We can ratify or decline to ratify. While ratifying can we make a request?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మనకు రావలసిన ప్రాంతాలను ఈయమని కోరడంలో అప్రస్తుతమేమీ లేదనుకుంటాను.

Mr. SPEAKER :—But can we make a request while ratifying.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఏమైనప్పటికీ ఈ విషయమై నా అభిప్రాయం వినగోరుతాను.

Mr. SPEAKER :—I think you can speak on that subject. A summary of our debate also goes there. Have you got anything to say in the matter Mr. Ramakrishna Raju.

SRI R. B. RAMAKRISHNA RAJU :—If the mover of an amendment does not want to reject the motion, I do not know if the amendment is in order. The amendment may be construed as rejecting the motion.

Mr. SPEAKER :—It is an addition to it. The amendment is by way of addition or a request added to it. We are ratifying it with this request added.

SRI R. B. RAMAKRISHNA RAJU :—If it is not an unconditional ratification, then it is not ratification.

Mr. SPEAKER :—Unless the ratification is unconditional, it cannot be ratification in law. It amounts to a counter proposal to the President.

SRI R. B. RAMAKRISHNA RAJU :—In this connection, I may state that in Madras some amendment was allowed to be discussed and voted down.

Mr. SPEAKER :—I do not feel inclined to allow it.

SRI M. RAJESWARA RAO :—It should be ratified or rejected as a whole. It cannot be subject to a condition.

Mr. SPEAKER :—The condition is by way of another resolution Does that resolution come under Article 368 of the Constitution ?

THE HON. Dr. B. GOPALA REDDI :—After ratifying, Sri Gopalakrishnayya can move his resolution. If there is quorwm we will see.

SRI A. KALESWARA RAO :— అధ్యక్షా, Article 368 క్రింద constitution కు amendment వచ్చింది; pass అయినది. ఆ Article క్రింద President's assent వచ్చేముందు కొన్ని విషయాలు సంతృప్తి చేయవలసి యున్నది. ఆ amendments ను సగం States ఒప్పుకోవలసి యున్నది. దానిని ఒప్పుకోవడమే తప్ప ఇది కావాలి, అది కావాలి అని అనడానికి లేదు. సగం రాష్ట్రాలు సంపూర్ణంగా ఒప్పుకుంటే దీనిని President assent కోసము పంపుతారు, లేకపోతే త్రోసివేస్తారు. Constitution amendment కు ఈవిధమైన పద్ధతి పెట్టినారు. అక్షరాలా, A to Z, ఏ విధమయిన addition, subtraction లేకుండా, సగం రాష్ట్రాలు ఒప్పుకుంటాయి. అప్పుడే President దగ్గరకు పంపుతారు ఈ పరిస్థితిలో మన position ఏమిటి? సంపూర్ణంగా ఆమోదించాలా, లేదా అనేది ఆలోచించాలి. మిగతా విషయాలు irrelevent, వేరే తీర్మానం తీసుకురావడం అంతకంటె irrelevent, అది వేరే subject. ఇది ratify చేయడమా, లేదా అనేది ప్రశ్న. వేరే requests చేయాలంటే మరొకసారి చేయవచ్చు. ఆంధ్రప్రదేశ్ వచ్చినతరువాత రోజూ అది కావాలి, ఇది కావాలి అని అడుగవచ్చు. ప్రస్తుతానికి r tify చేయడమా, మానడమా అనేదే ప్రశ్న.

SRI R. B. RAMAKRISHNA RAJU :— అదే నా అభిప్రాయం కూడాను. ఇష్టమయితే ratify చేయవచ్చు; లేకపోతే ratify చేయము అని చెప్పవచ్చు.

Mr SPEAKER :—I think Mr. Krishnavataram is also of the same view.

SRI S. RANGANATHA MUDALIAR :—The amendment is in-admissible and any discussion on the amendment also may be ruled out. What is the use of discussion on an amendment which is not admissible. What has happend in Madras need not guide us.

Mr. SPEAKER :—I am ruling out the amendment.

30th September 1956]

SRI S. K. V. KRISHNAVATARAM :—I agree with Mr. Kaleswara Rao as there is no possibility of an amendment. But we can express our opinion in the debate.

Mr. SPEAKER :—I rule out the amendment.

( At this stage Sri S. Ranganatha Mudaliar occupied the Chair )

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈనాడు మనం ఒక నూతన ఘట్టంలోకి, భారతదేశ చరిత్రలో ఈ శాసనం అంగీకరించడం తోటి, వెళ్ళుతున్నాం. భాషా ప్రయుక్త రాష్ట్రములు కావలెనని చేసిన ఆందోళన ఫలితం. స్వాతంత్ర్యం కోరినటువంటి ప్రాతిపదిక రెండుకూడ అన్వయమై నూతనమైనటువంటి నిర్మాణరూపంలోకి మనం వెళ్ళుతూ ఉన్నాం. వారు తీసుకొని వచ్చిన proposition హృదయపూర్వకంగా బలపరుస్తూ ఉన్నాను. ఈశాసనమును ఆనందపూర్వకంగా మనమందరము స్వీకరిస్తున్నాము. దీంట్లోముఖ్యంగా పొట్టిశ్రీరాములు గారు ఉపవాసంచేసి చచ్చిపోయిన తర్వాత, ఆంధ్రలో ప్రధానంగా ఉద్యమం నిర్వహించి దాని ఫలితంగా వచ్చినట్టి పరిణామమే భాషా రాష్ట్ర నిర్మాణం. ఆ రోజు కూడ చాల చర్చలు వచ్చాయి. ఒక్కసారే మనం విశాలాంధ్ర అడుగుతాము. ఆంధ్రరాష్ట్రం ఇప్పుడు అక్కర లేదు అనేవాండ్లు కొందరు ఉన్నారు. అసలు విశాలాంధ్ర అక్కర లేదు. ఆంధ్ర రాష్ట్రమే కోరుతామనేవాండ్లు కొందరు ఉన్నారు. ఆంధ్ర రాష్ట్రం కూడ అక్కర లేదు దాంట్లోనే ఉంటామనేవారు కొందరు ఉన్నారు. దాంట్లోనే సగభాగంగా Administrative గ మార్చేటట్లయితే దానితోటే సంతృప్తి పొందుతామన్నారు. కాని ఆరోజు చెప్పింది ఒకటే. ఆంధ్ర రాష్ట్రం, మద్రాసు రాష్ట్రంలో ఉన్నటువంటి తెలుగు జిల్లాలతో ప్రత్యేక రాష్ట్రం ఏర్పడనిదే విశాలాంధ్రకు మన మార్గం వెళ్ళదేమో అని ఆరోజు ఖచ్చితంగా చెప్పాం. అది అందరి అభిప్రాయం అయినప్పుడు ఇబ్బంది లేకపోయింది. అది సుగమన మార్గం అయింది. అయితే దానికి త్యాగాలు ఎక్కువ చేయవలసి వచ్చినాయి. ఈ త్యాగాలలో వేటిని జ్ఞాపకంఉంచుకోవాలంటే, మనం రేపు నిర్వహించబొయ్యే రాష్ట్రం అంత తేలికగావచ్చింది కాదని అనేకమైన మహత్తరపురుషుల యొక్క త్యాగాల ఫలితంగా వచ్చిందని, దాని యొక్క ఆశయం అడుగునఉన్న సామాన్య జనానికికూడ ఆనందం, సుఖం సంపద రావడానికి చేస్తున్నాంగనుక అదివచ్చిందాలేదా అని గుర్తుపెట్టుకోడానికి పాత చరిత్ర యొక్క త్యాగాలను జ్ఞాపకం ఉంచుకోవలెనని చెప్పుతున్నాను. అదే ఇప్ప

టికి భాషారాష్ట్రాలుగా చాలవరకు వచ్చినాయి. ఒక బొంబాయి రాష్ట్రములో మాత్రం భాషారాష్ట్రంగా విభజించకుండా రెండు రాష్ట్రములను కలిపి భాషా రాష్ట్రంగావేశారు. కాని ఇది చింతపడవలసిన విషయం. అందుకు నేను మనవి చేసేది ఒకటి. మహారాష్ట్రీలు, బొంబాయితో కూడినటువంటి రాష్ట్రం కావలెనని కోరారు. అది వారికి నిజమైనటువంటి న్యాయమైనటువంటి కోరిక. కాని దానిని తలపటాయించి బొంబాయిని ఏమన్నా విడిగాచేయాలనిచేసిన ప్రయత్నం ప్రజలంతామాత్రం సహించలేక ఎదుర్కొన్నారు. చివరకు వాండ్లు జయం సాధించారు. ఆ జయం పూర్తిజయంమాత్రం కాదు. అది సర్దుబాటుజయం అని చెప్పుతాను. ఎప్పుడైతే మొత్తంగా గుజరాతునుకూడ కలుపుతామని అనుకొన్నారో గుజరాతి సోదరులుకూడ తమ రాష్ట్రంకోసమని ఆందోళనచేశారు. వాండ్లు ఆందోళన చేయడంకూడ చాల న్యాయమైనది. కాని ఒక ప్రధానమైనచిక్కు ఉంది. దానిని ఇద్దరు గుర్తించలేదని మీ ద్వారా మనవిచేస్తున్నాను. నేను All India Linguistic Conference లో ఉన్నపుడుకూడా అక్కడ ఉన్నటువంటి అమృతపాండ్యా, గుజరాతి నాయకులు, భాషారాష్ట్రానికి తీవ్రంగాఆందోళనచేసిన అతనితో నేను చెప్పింది ఒకటే. మీరుమహాగుజరాతి అడుగుతున్నారు. మేము భాషారాష్ట్ర వాదులంగా పూర్తిగా బలపరుస్తున్నాము. అయితే మీరు బొంబాయి కావలెనంటూరా, అక్కర లేదంటూరా అని చెప్పమన్నాము బొంబాయికూడమాకు కావాలన్నారు. మద్రాసులో మేము majority గలేము గనుక మేము కోరలేదు. ఆ విధంగా మద్రాసును మేము కోరలేదు. ఆవిధంగా మా ఆంధ్ర సమస్యను పరిష్కరించుకొన్నాం. అదే మాదిరిగ మీరుకూడ బొంబాయి మీదికాదని చెప్పివేసి గుజరాతి సమస్యకూడ పరిష్కరించండి. భాషాప్రయుక్త రాష్ట్రసమస్య బొంబాయి రాష్ట్రముతో తేలిపోతుందన్నాం. మొన్న జరిగిన వివాదంఅంతా చూచినపుడు నాకు చాల ఆశ్చర్యంవేసింది. అసలు crucial point లో ఎవరు ఏమి జవాబు చెప్పలేదు. బొంబాయితోటి మహారాష్ట్రం కావలె అన్నారు. బొంబాయితోటి గుజరాతి రాష్ట్రం కావలెనని ఆందోళనచేశారు. ఇద్దరి ఆందోళన బలపరచారు. ఉపారు జరిగింది. దాని పరిణామంమాత్రం ఇద్దరిని కలుపవలసివచ్చింది. దీనివల్ల భాషా రాష్ట్రం మాత్రం మరచిపోయినారు. అందువల్ల ఇప్పటికికూడ గుజరాతి సోదరులకు చెప్పడం ఏమంటే 'మీరు భాషారాష్ట్రం అడగడం న్యాయం. మహాగుజరాతికోసం ప్రయత్నించండి. సాధించండి. మీరు ఈనాటికన్నా బొంబాయి మహారాష్ట్రీలది గనుక, ఆప్రాంతం మధ్యలో ఉందిగనుక, వాండ్లకు మేము ఇచ్చివేస్తున్నాము.

మాకుమాత్రం గుజరాతిరాష్ట్రం ప్రత్యేకంగా ఇవ్వండిఅని మీరు అడిగితే మీరు భాషారాష్ట్రవాదులయొక్క అందరి ప్రోద్బలాన్ని ఉత్సాహాన్ని పొందుతారు ఈనాటికైనా మించిపోయింది లేదు. గుజరాతి త్వరలో ఆవిషయం చేయవలసిందని' కోరుతున్నాను. అన్ని రాష్ట్రములుకూడ విభజనచేశారు. మన రాష్ట్రంలోకి వచ్చేటప్పటికల్లా మనకు ఇతరప్రాంతములన్నికూడ కలసి ఉన్నాయి. ఈప్రాంతాలు కలిసిఉన్నవాటిలో ఈరోజు మద్రాసు రాష్ట్రంలో ఉన్నటువంటి తెలుగు ప్రాంతము సమస్యఉన్నది. అదిమనకు తీవ్ర ఆవేదనగా ఉంది. నిరంతరము ఆందోళన జరుగుచున్నది. ఆంధ్రులయొక్క న్యాయమైన ఆందోళన జరుగకుండానే, మనయొక్కకోరిక అంగీకరిస్తారనే విశ్వాసం ఉన్నందువల్ల కావలసినంత హడావిడి చేయటంలేదు. కాని అది న్యాయంగా రావలసియున్నది. దాని విషయంలో Boundary Commission ఏర్పడవలసిన అవసరంఉంది. అట్లానే వేపురపల్లి, హోసూరు ఉన్నాయి. అవి ఆంధ్రలోకి రావాలి. Kolar వగైరా ప్రాంతములు మైసూరురాష్ట్రంలో ఉన్నాయి. వారికిఒక అనుమానం ఉంది అని నాకు తెలుసును. ఎట్లాగయితే తెలంగాణా వాసులు కొంత అనుమానపడ్డారో Kolar area లో మైసూరు రాష్ట్రంలో ఉన్నటువంటి మిత్రులకు కూడ కొన్ని అనుమానాలు ఉన్నాయి. వారికి ఒక మనవి చేయదలచినాను. ఏమంటే మీరు ఇన్నాళ్లనుంచి కర్ణాటక భాషలో ఉన్నారు. మైసూరుతో కలిసి ఉన్నారు. కొన్ని సౌకర్యాలు పొందమేమో అని అనుకొంటున్నారు. అదేవిధంగా తెలంగాణ సోదరులుకూడ అనుకొన్నారు. తెలంగాణ సోదరులకు ఇచ్చిన షరతులప్రకారం కొన్నిఒడంబడికలు ఇచ్చాం. అదేవిధంగా మీరుకూడ 5 సంవత్సరములవరకు మీ జిల్లాలలో, మీకు కావాలంటే కర్నాటక పరిపాలన తాత్కాలికంగా నిర్వహించుకొనే పద్ధతితోటి మీరు చేసుకోండి. అయిదు సంవత్సరాలు అయినతర్వాత ఆంధ్రరాష్ట్రం ఇందులో కలసిపొయ్యే స్థితి వస్తుంది. దానికి మీరు అంగీకరిస్తే బాగా ఉంటుంది. అని చెప్పి తెలంగాణావారికి ఇచ్చినటువంటి హామీలు ఏవి ఉన్నాయో, అవే మీరుకూడ పురస్కరించుకొని, మీరందరు ఆంధ్రలో కలవటానికి ప్రయత్నించాలని అటు తెలుగుమిత్రులను కోరుతున్నాను. ఇటు ప్రభుత్వాన్ని Boundary Commission వేయవలెనని కోరుతున్నాను.

తర్వాత బళ్ళారి విషయం ఉన్నది. మొన్నటిరోజు democracy ప్రకారంగా ఎలక్షను జరిగింది. తెలుగుప్రాంతం కానిదికూడ కలపవలసినగతి పట్టింది. ఇందువల్ల

మొన్న గంగప్పగారు నిలిచారు. కాని తెలుగు ప్రాంతంగా కోరినటువంటి మూడు ఫిర్కాలలో, రూపనగుడి, మోకా, బళ్ళారి townతో కలిసిన ఫిర్కాలలో ఖచ్చితంగా మెజారిటి ఉంటున్నదే అని చెప్పి వాండ్లు ధ్రువపరచారు. అది ఆ ప్రకారంగా అగుపడుతున్నది. ఆ సమయంలో democracy అవలంబించమని మనం అందరం చెప్పాం. కాని దురదృష్టవశాత్తు ఈ విషయంలో వల్లభపంతుగారు చెప్పిన మాటమాత్రం బాగాలేదని చెప్పక తప్పదు. Seshagiri Rao లోక్ సభలో ఉపన్యాసం ఇస్తూ పార్లమెంటులో మాట్లాడుతూఉండగా వారు ఒకమాట చెప్పారు.

'I am surprised to see the Hon. Minister saying this morning this is of course subject to correction—that the Andhra people do not very much mind the retention of Bellary in Mysore State...........I said all sensible people."

దానికి ఎంతో ఆందోళన చేశారు. ఎంతమందో వెళ్ళారు. దానిమీద మళ్ళా వారు అన్నారు. "I said all sensible people" అన్నారు. ఇది చాలా అభ్యంతరకరమైన విషయమని నేను ఈ సభద్వారా వినయపూర్వకంగా మనవి చేయక తప్పదు. ఆ తర్వాత ఇక్కడ మనం తీర్మానం చేశాం. తీర్మానం చేసినపుడు. ఆంధ్ర రాష్ట్ర శాసన సభ్యులు అంతాకూడాను sensible people కారు అని వారి అభిప్రాయం అని నేను అనుకోను. అయితే రాజుగారి పెద్దభార్య ప్రతివ్రత అంటే రెండో భార్యను ఇంకొకవిధంగా అనుమానించవలసిన పరిస్థితి వస్తుంది గనుక ఎప్పుడైతే మనము ఆ తీర్మానం చేశామో మనం sensible people కాదు అనే టటువంటి అభిప్రాయం వస్తుందిగనుక, వారికి మనవి చేసేది ఏమంటే, ఆ మాట ఉపసంహరించుకోనవలసివస్తుంది. అంటే వల్లభపంతుమహాశయా! అని మీ ద్వారా తెలియచేస్తున్నాను. బళ్ళారి విషయంలో ఆంధ్రుల హక్కులు నిర్ణయింపబడ్డాయి. అందువల్ల అది ఏనాటికైనా రాక తప్పదు. అందువల్ల నేను కోరేది, మోకా, రూపనగుడి, బళ్ళారి ఫిర్కా మూడుకూడ ఆంధ్రులకు రావలసిన అవసరంఉంది.

ఈ రోజున రాజోలిబండ ప్రాజెక్టును అక్కడ కట్టుతున్నాం. అక్కడ ఉన్నటువంటి accumulated Reserve లను అంతాకూడాను ఒక్కొక్క Project కు పెట్టడం, వారు మరొక రాష్ట్రానికి అని చెప్పేసి management చేస్తూ దాన్ని చూస్తూ కూర్చోవడమేనా మనపని. ఈ వేళతో ఆంధ్రప్రదేశ్ కు వచ్చిన తర్వాత మనమందరము కలిసి రాజోలిబండ ప్రాజెక్టు ఖర్చును భరించపోతున్నాం. కానీ

ఆ ప్రాంతం రాయచూరుజిల్లాలో ఉంది. కానీ న్యాయంగాచూస్తే ఆ 26 గ్రామాలుకూడా అచ్చం తెనుగుగ్రామాలు. కనుక ఆ తెలుగుగ్రామాలన్నీకూడాను తెలుగుప్రాంతంలోకి రావాలి. దానిని ఆలోచించవలసిన అవసరంవుంది. ఇకపోతే బస్తరు ఉంది. మనం గోదావరిప్రాజెక్టునుకట్టాలని చాలాతీవ్రంగా ఆలోచిస్తున్నాం. గోదావరిప్రాజెక్టు catchment area అంతాకూడా ఎక్కడవుంది అని ఆలోచించినట్లు అయితే ప్రధానంగా బస్తర్‌లో ఉన్నవని జ్ఞాపకం ఉంచుకోవాలి. శబరికి Project కావాలని ఆలోచిస్తున్నారు. ఈ నాడు శబరికి Project కట్టాలనేచోటే కట్టితే నష్టంవస్తుందని నేను చెప్పుతున్నాను. కానీ దానికిపైన 45 మైళ్లలో జయశ్రీ అనే ఒక ఊరు ఉన్నది. ఆవూరుదగ్గిర Project కట్టాలనే కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. కేంద్రప్రభుత్వం ప్రత్యేకంగా వేసిన కమిటీ చెప్పింది. అక్కడ మనం నిర్ణయించినప్పుడే ఈ రోజున గోదావరిలో వస్తున్నటువంటి వరదలను అన్నిటినీకూడా ముంపు నివారణ చేసుకోగలం. పెద్ద Project ను కూడా నిర్మించుకోగలం. అందువల్ల నేను చెప్పేది దక్షిణబస్తరు మొత్తంకూడా మన రాష్ట్రంలోకి రావలసిన అవసరం ఉంది. ఇకపోతే ప్రధానవిషయం ఒకటి ఉంది. మనం మళ్లీ మరొకదశలోకి పోతున్నాం. ఇప్పుడు పర్లాకిమిడి మున్నగు ఆంధ్ర ప్రాంతాలగురించి తక్కినమిత్రులు మాట్లాడుతారు. అయితే అవంతాకూడా పోకుండా పోరాడవలసిన అవసరం ఉంది. ఈ మొత్తం రాకపోయేటట్లు అయితే మనం Map ను చూచుకొన్నా, భాషనుచూచుకొన్నా మనకు చాలా అన్యాయం జరుగుతుంది గనుక ఈ ప్రాంతాలు మనకు వచ్చినప్పుడే మనం రేపు నవంబరు ఒకటవ నాటికి మనం ఆంధ్రప్రదేశ్ ఉత్సవాలు చేసుకోబోతున్నపుడు, ఈ ప్రాంతాలలోని ఆంధ్రులంతాకూడా మేము ఆంధ్రులము అని అనుకోనక్కరలేదా ? అనుకోవాలి. అందుకోసమే మనం ఒకనాటికయినా కలుస్తాం అనేటటువంటి ఆశ అయినా ఉంటుందన్న విషయాన్ని చెప్పుతున్నాను.

ఇకపోతే రాష్ట్రాలలో కౌన్సిల్సును ఏర్పరచాలి అని చెప్పి వ్రాశారు. అసలు కౌన్సిలు ఏమన్నా అనవసరం అని అనుకొంటున్నారు. అందువల్ల రాష్ట్రాలలో కౌన్సిల్స్ అక్కరలేదనే అభిప్రాయాన్ని నేను చెపుతున్నాను. తర్వాత Sonal Councilsను ఏర్పరచారు. ఈ Sonal Councils ను గురించి Constitution Amendment లో ఏమీలేదు. States Reorganisation Report లో మాత్రమే ఉన్నది. అందువల్ల constitutional గా Zonal కమిటీలు ఏర్పడుట లేదనేది సంతోషమే. ఈ జోన్సునుగురించి ఏమిచర్య జరుగుచున్నదో తెలియపరచే బాధ్యత, అది

శాసనసభలకుకూడా తెలియపరచాలని చెప్పేసి అట్లాంటి Provision States organisation బిల్లులో ఉంది. దీంట్లో కూడా లేదు. ఆ విషయాన్ని ఆలోచించాలి.

ఇకపోతే ఆంధ్రాయెన్నికలు ఒక అయిదు సంవత్సరములవరకూ పెంచారు. మనచేతుల్లో ఉండిగనక మనంకోరాం. వారిచేతులలో ఉందిగనక మనకు దీర్ఘాయుష్మాన్భవ అని చెప్పారు. మనం 5 సంవత్సరాలపాటు ఎక్కడ ఏమిజరిగినా ప్రపంచంలో ఏమైనా భయంలేదు. ఒక వేళ శాసనసభ్యులు పోట్లాడుకొని Vote-down చేసుకొంటే బయటికి వెళ్లాల్సిందేకానీ బయటవాళ్లతో సంబంధంలేకుండా 5 సంవత్సరాలపాటు మనం ఉండవచ్చును. కాని ఇది Democracy కి చాలా నష్టం. దేశంలోని రాష్ట్రాలంతాకూడా ఎన్నికల హడావిడిలో మా ఎన్నికలు ఏమి అవుతుంది అని, మా ప్రాతినిధ్యం నిలుస్తుందాఅని అనుకొంటుంటే, మాకుఏమైనా గ్యారంటీ ఉన్నదికనుక, మీ ప్రజలసంగతి మాకు జ్ఞాపకంలేదని చెప్పడం అంత సబబు కాదేమోనని అనుకొంటున్నాను.

తర్వాత రెండురాష్ట్రాలకు ఒక గవర్నరును తీసుకొనివచ్చారు దానివల్ల ఎంతప్రమాదం వస్తుందో ఆలోచించాలి. మనం మద్రాసురాష్ట్రంనుంచి విడివడ డానికి కోరిన ప్రధానకారణం ఏమిటంటే, మనకు రెండుప్రాంతాలకు, మూడు ప్రాంతాలకు, నాలుగు ప్రాంతాలకు కలిసి ఒకే గవర్నరు ఉన్నారు. అందులో ఆయన ఎటుపడితే అటు అనుతున్నాడు. ఆ ప్రాంతానికి మేము వేరే ఉంటే సరిపోతుందని చెప్పాం. రెండుప్రాంతాలకు ఒకగవర్నరును ఏర్పరచే టటువంటి విధానాన్నిమాత్రం సహించడానికి వీల్లేదు. దానిని మార్పుచేయాలని కోరుతున్నాం. General గా మనం agree అయినప్పటికిని అది reopen చేయవలసి నటువంటి issue అని నేను మనవిచేస్తున్నాను.

ఇకపోతే ప్రాంతీయ సంఘాలున్నవి. ఈ ప్రాంతీయ సంఘాలు కొన్ని పరిస్థితులలో ఏర్పడ్డాయి అన్నారు. బాగానేవుంది. కానీ ప్రాంతీయసంఘాలు, ఆ ప్రాంతంవాళ్లు ఆలోచించుకొంటే వాళ్లకు నష్టంవస్తుంది. అయితే మా నష్టం సంగతి మీకెందుకంటారేమో, బాబూ మీరు ఆలోచించండి తర్వాత చెప్పుదాం లెమ్మన్నారు. కానీ ఒక అన్యాయముంది. శాసనసభలోనున్న సభ్యుల్లో తెలంగాణా ప్రాంతానికి ఇతరప్రాంతాలకి రెండింటికి కలిపి రెండు సంఘాలు లేవు. మనం వద్దు అన్నాము. బాగానేఉంది. వార్కి ఏర్పరచినట్టి సంఘంలో

ఒక అభిప్రాయంయిస్తే, అది శాసనసభ ఒప్పుకోకపోతే దీనిని నిర్ణయించ వలసినవాళ్లు ఎవరు అంటే గవర్నరుకు సర్వాధికారాలు ఇచ్చారు ఇది చాలా విషాదకరమైన విషయం మళ్లీ గవర్నరుకు సర్వాధికారాలు యిచ్చే విషయం ఎందుకు ఈ బ్యూరోక్రాటిక్ అడ్మినిస్ట్రేషన్‌లో గవర్నరు అంటే with the advice of the ministers అనిమాత్రం కాదు. Ministers advice లేకుండా ఉండే టటువంటి పూర్వం 1935 Act లో at his own discretion with his judgment అనే ప్రకారంగా మాత్రం జరుగుతూందని మీరనవద్దు. ఇది న్యాయంకాదని చెప్పుతున్నాను.ఆ తర్వాత ఈ ప్రాంతీయ సంఘాలు ఐదు సంవత్సరాలతో ముగిస్తే మంచిది. ఏలెక్క ప్రకారంకూడా పదిసంవత్సరాలు దాటకూడదు. ఆవిధంగా constitution amendment లేకపోవడం కష్టంగా ఉంది. అందువల్ల రేపురాబోయ్యే దాంట్లో దాన్ని తప్పకుండా Reopen చేసి పదిసంవత్సరాలకన్న ఈ Regional Councils ఉండవు అనేసి ఖచ్చితంగా వ్రాయవలసినటువంటి అవసరం ఉన్నది.

High Court Judges ను ఇక్కడనుంచి అక్కడనుంచి మార్చటం పెట్టారు. పెట్టితే దానికి మనం అభ్యంతరం చెప్పవలసిన అగత్యం ఏమీలేదు. కానీ ఒకటిఉంది. High Court Judge చేసి retire అయినవాడు మళ్లీ Practice చేయవచ్చునంటే కాస్త అతనికన్న Junior Lawer అక్కడ కూర్చుకుంటే పాత Judge గారు గనుక వచ్చి arguement ను చెప్పితే ఆ క్రొత్తగావచ్చిన Judge గారు ఎవరిపక్షం చేద్దామని కాస్త పెద్దమనిషితరహాతో లేనిపోని Reaction వచ్చేసి ఆయనకు అనుకూలంగా చేద్దామనట్లు వస్తుందేమో. ఇదివరకే ఏమి చెప్పారంటే High Court Judge ఒకసారిచేస్తే అతను మళ్లీ Practice చేయకూడదన్నారు. ఈ వేళ కూడా అట్లాంటిది ఉండాల్సిఉంది. Supreme Court కో ఆయన ఏ High Court కో Judge గా చేశాడో ఆకోర్టు మినహాయించి చేయవచ్చునని చెప్పారు. కానీ అది కూడ న్యాయంకాదని చెబుతున్నాను. అయితే ఈ సందర్భంలో ఒక చిన్న విషయం చెప్పాలనుకుంటాను. High Court లకు Benches ఉన్నవి అక్కడక్కడ. State Reorganisation భాగంగా మాత్రం Benches అక్కరలేదు అనడం నేను కూడ పూర్తిగా అంగీకరిస్తున్నాను. కానీ సౌకర్యాన్నిబట్టి అలహాబాదులో, ఆగ్రాలో ఏర్పరచినట్లుగానే ఎక్కువ కేసులు ఉండేచోట కక్షీదారులు దూరంగా పోకుండావుండే అవకాశం ఏదైనాఉంటే ఆవిధంగా ఆలోచించి గుంటూరులో ఒక Bench ని పెట్టడానికి ప్రయత్నించమని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. కేంద్ర అధికారాలు రాష్ట్రానికి ఇచ్చినట్లేPlanning విషయంలో మనం రాష్ట్రాధి

కారాలు కూడా కేంద్రానికి ఇచ్చాం. అయితే దీంట్లోనాకు అనుమానమున్నది. గవర్నరు ఇవ్వవచ్చును అనిఉంది Constitution లో. బాగానేఉంది. నాకు అనుమానం ఏమిటి అంటే ఈ గవర్నరుకు ఇదివరకు ఒక్కరూపమే ఉండేది. ఇప్పుడేమో త్రిముఖ గవర్నరుగారు అయినారు. ఒకరు ఎవరు అంటే Regional Committee లో ఉండే గవర్నరుగారు; ఒకరు Ordinary Adminstration లో ఉండే గవర్నరుగారు; ఒకరు ఈగవర్నరుగారు; మంత్రులadviceతో చేస్తారు ఇతర గవర్నరుగారిRegional Councils నిర్ణయిస్తే Committeeలోవచ్చేటటువంటి గవర్నరుగారు వీళ్ళకు అతీతంగా ఉంటారని మాకు Constitution చదివితే తెలుస్తుంది. గనుక అది పనికిరాదు. ఆ గవర్నరుగారు ఎవరైయుండాలంటే, nominal గా మనం చేసేటటువంటి వ్యవహారం అంతా కూడా గవర్నరుద్వారా చేస్తాం గనుక ఆవిధంగానే చెయ్యాల్సింది తప్పితే ఈయనకు మాత్రం క్రొత్తగా discretion తీసుకొనేటటువంటి విధానం మాత్రం ఉండకూడదని చెప్పుతున్నాను అల్పసంఖ్యాకుల భాషారక్షణ విషయంలో తీసుకొచ్చిన మార్పుకు చాలా సంతోషం. దానికి ఒక కమీషన్‌ను వేస్తామన్నారు. వారిని Report పంపించమన్నారు. ఇది చాల సంతోషం. అయితే నేను ఒకటి చెబుతున్నాను. ఆ కమీషనరు ఎప్పుటికప్పుడు ఉన్నటువంటి పరిస్థితుల్లో ఏవిధంగా చేస్తారో, కావాల్సినటువంటి మెజారిటీ నిజంను కూడా దాంట్లో వ్రాసి ఉంటే బాగుండేది. భాషకు పదివేను మంది ఒకవూళ్ళో చదవటానికి వీలు ఉంటే వాళ్ళకు ఆ భాషకు సంబంధించిన పాఠశాలలను కూడ పెట్టడం అవసరం అని, అట్లాంటి రక్షణ కూడా ఇప్పించమని ఈ బిల్లును సంతోషపూర్వకంగా ratify చేస్తూ ఈ సవరణలను కూడా ఏనాటికైనా చేస్తే సంతోషం అని నేను దీనిని బలపరుస్తూ ముగిస్తునాను.

SRI A. KALESWARA RAO:— అధ్యక్షమహాశయా ! మహత్తరమైన మార్పులు జరుగుతున్న ఈ రోజులలో మనం వున్నామనీ, పుట్టినామనీ. పెరిగినామనీ, దీనిలో మనంకూడా ఉడతాభక్తితో పాల్గొన్నామని అనుకోడంకంటే ఆహ్లాదం కల్గలేదు. కలుగనేరదు. స్వరాజ్యంకోసం గాంధీమహాత్ముని నాయకత్వం క్రింద చారిత్రాత్మక సత్యాహింసలతో అంతర్జాతీయ రంగంలో ఆకసము వైపుకు మనపతాకమును ఎగురవేసినట్టి మహత్తరమైన ఉద్యమమును నడిపాము. పొట్టి శ్రీరాములుగారి త్యాగఫలితంగా ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది. కాని ఇది చాలదు. యావద్భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు కావాలని కోరినాము. 1905 సంటలో బంగాళా విభజననాటినుంచీ వ్యతిరేకమైన ఉద్యమం సాగినది.

30th September 1956] [Sri A. Kaleswara Rao

గట్టిగా పట్టుదలతో ముందంజ వేశాము. 1940 సం॥లో ఆంధ్రరాష్ట్రం కావాలని కోరినాము. దేశపటమునంతనూ మళ్లీమార్చాలని కోరినాము. అటువంటి కోర్కెలన్నీ సాధించుకున్నాము. Government of India వారు ఫజుల్ ఆలీ కమీషనువారు మొదట వ్యతిరేకంగాఉన్నారు. బెంగుళూరులో All India Congress Committee లో శ్రీ జవహార్లాల్ నెహ్రూగారు హైద్రాబాదు విచ్ఛిన్నతకు ఎంతో వ్యతిరేకంగా చెప్పినమాటలు అందరకూ జ్ఞాపకం ఉన్నాయి. 1949వ సం॥ లో సర్దార్ వల్లభాయ్ పటేల్ గారు "తొందరపడవద్దు; హైద్రాబాదు విభజనను ఇప్పుడు కోరవద్దు" అని నాకు ఉత్తరం వ్రాశారు. ఇప్పుడు అటువంటి పరిస్థితులన్నీ మారాయి. ఫజులాలీ కమిషన్ రిపోర్టు వచ్చింది. హైద్రాబాదు విచ్ఛిన్నత అత్యంత ప్రధానమైన విషయం. హైద్రాబాదు విచ్ఛిన్నతవల్ల భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం వచ్చింది. ఆంధ్ర కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాలుకలిసి విశాల సంయుక్త కర్ణాటకగా సంయుక్త మహారాష్ట్రం ఏర్పడడమే దాని ప్రధాన లక్ష్యం. ఇదంతా జరిగింది. ఒక గొప్ప Act pass అయినది States Reorganisation Act ప్రకారం నిజంగా భాషాప్రయుక్తరాష్ట్రాలే ఇచ్చారు.

అనేక తర్జన భర్జనలు. ఆందోళనలు జరిగాయి. ప్రజలకు ఆవేశాలు పెరిగాయి. చివరకు భాషాప్రయుక్తరాష్ట్రాలే లభించాయి. ఒక్క హిందీభాషకు తప్ప తక్కిన ప్రతీ ముఖ్యమైనభాషకూ ఒక్కొక్క రాష్ట్రం వచ్చింది.

ఈ మధ్య బొంబాయిలోనూ, గుజరాతులోనూ జరిగిన అల్లరులవల్ల ఇండియా గవర్నమెంటువారు ఒక్క తీర్మానానికి రాలేకపోయినారు.

ఎప్పటికయినా గుజరాతీయులువిడిపోయి తమ ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకుంటారనీ, బొంబాయిని వేరే రాష్ట్రంగా విడిచిపెడతారనీ నా ఆశ. అది శాంతియుతమైన ఆందోళనవల్ల త్వరలోనే జరుగుతుందని నా ఆశ. భాషారాష్ట్రాలు ఆచరణయోగ్యమైనవి కావు. వాటినిగురించి కలలుకనడం చాలా తప్పు, అని నా అభిప్రాయం. ఏకభాషారాష్ట్రాలే ఏర్పడినాయి. A, B, C, తరగతి రాష్ట్రాలు తీసేశారు.

ఇప్పుడు 14 పెద్ద రాష్ట్రాలుఏర్పాటు చేశారు. వీటిలో ఆంధ్రప్రదేశ్ మొదటిది. ఇది మనం సగర్వంతో తెలుసుకోవలసిన విషయం. రాష్ట్రాల list చూచినట్లయితే మొదటిది ఆంధ్రప్రదేశ్. 1,10,250 చ॥ మైళ్ళ విస్తీర్ణం, 3,22 లక్షల జనసంఖ్య గలదు. 14 రాష్ట్రాలలోని జనసంఖ్యలో మనది 4 వ

రాష్ట్రంగా ఏంచబడుతుంది. మొదటిది ఉత్తరప్రదేశ్. 632 లక్షల జనసంఖ్య ఉన్నది. రెండవది బొంబాయి. అది తాత్కాలికమేనని నా అభిప్రాయం. ఎప్పటికైనాసరే గుజరాత్ విడిపోతుంది. బొంబాయి, మహారాష్ట్ర కలిసి ఒక రాష్ట్రం అవుతాయి. ఇది నా నిశ్చితమైన నమ్మకం. ప్రస్తుతం దాని జనాభా 478 లక్షలు వుంది. మూడవది బీహార్. 3,89 లక్షలు. (4) 328 లక్షలున్న ఆంధ్ర ప్రదేశ్. విస్తీర్ణంలో మనరాష్ట్రం అయిదవరాష్ట్రం. ఉత్తరప్రదేశ్, బొంబాయి, మధ్య ప్రదేశ్, రాజస్థాన్ ఇవి మనకంటే పెద్దవిగా వున్నాయి. కనుక ఈ Act ను pass చేసినందుకు ఆంధ్రప్రజల తరపున, విశాలాంధ్ర ప్రజల తరఫున రాష్ట్రప్రభుత్వానికీ, ఇండియాగవర్నమెంటువారికీ, కాంగ్రెసు హైకమాండుకు నా కృతజ్ఞతను తెలుపుతున్నాను. అభినందిస్తున్నాను. ఇది ఒక భాగం. రాజప్రముఖులను రద్దు చేశారు. Part 'B' states పోవడం అనేది చాలా గొప్పవిషయం.

1926 వ సంవత్సరంలో మహారాజులను జమీందారులను రద్దు చేయవలసిందని All India Congress Committee లో నేను ఒక తీర్మానం పెడితే కొట్టేశారు. తరువాత సర్దార్ వల్లభాయ్‌పటేల్ మహారాజులను రాజప్రముఖులుగా మార్చినారు. ఇప్పుడు ఆ రాజప్రముఖులనుకూడా రద్దుచేస్తున్నారు. నిరంకుశంగా బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు ప్రజలను తమ బానిసలుగా చేసుకొని అకృత్యాలను జరిపినటువంటి ఆ పరిపాలన అంతమైపోయింది. ఈ ఫ్రెంచివిప్లవానికి కారణములేవో, రూసో, వాల్టైర్ ఏసిద్ధాంతాలను చెప్పారో గమనించి వాటన్నిటిని ఇండియాలో ఇప్పుడు అమలుజరిపాము. ఇవన్నీ constitution amendment లో గమనించవలసిన ముఖ్యమైనటువంటి విషయాలు, First schedule లో 14 రాష్ట్రాలు ఉన్నవి. Union territories అని 6, 7 ఉన్నవి. ఇది చాలముఖ్యమైనటువంటి మార్పు. తక్కినవి స్వల్పమైనటువంటివి. పరిపాలనాసంబంధమైనటువంటి మార్పులు, అనేకం జరిగాయి. మనకు సంబంధించినటువంటిది ముఖ్యమైనది ఒకటి ఉన్నది. మనకు ఆంధ్రప్రదేశ్ వస్తున్నది. ఆంధ్రప్రదేశ్ వస్తే Assembly కి ఎప్పుడు ఎన్నికలు జరుగుతాయి ఎన్నాళ్లు ఉంటాము అనేవిషయాలు ఆలోచించుకోవలసి ఉంటుంది. అంటే వ్యక్తిత్వంకోసం కాదు. ప్రజాప్రతినిధులంగనుక ఇవన్నీ ప్రతివాళ్లు ఆలోచించుకొనే విషయాలు. States Reorganisation Act లోని 29 వ section ప్రకారం తెలంగాణాకు ఎన్నికలుజరుగుతాయి. వాళ్ళకు 5 సంవత్సరాలు అయిపోయింది, కనుక పార్లమెంటు ఎన్నికలతోపాటు ఫిబ్రవరిలో ఎన్నికలు జరుగుతాయి. 1957వ సంవత్సరం మార్చినుంచి ఆంధ్రప్రదేశ్ Legislative Assembly తెలంగాణావారు

ఎన్నుకొనే క్రొత్తసభ్యులతోను, మన పాత memberలతో సహా 5 సంవత్సరాలు ఉంటుంది. అంటే మరల 1962వ సం॥ లో ఎన్నికలు జరిగేవరకు మనంఉంటాము. తెలంగాణాసభ్యులు 3 ఏండ్లకే పోకుండా 5 ఏండ్లదాకా ఉంటారు. ఆంధ్రప్రదేశ్‌కు, పంజాబ్‌కు Regional Committees పెడతారు. తెలంగాణా వెనుకబడ్డటువంటి ప్రాంతమని ముఖ్యంగా విద్యావిషయంలో వెనుకబడ్డదని మనం ఒప్పుకొన్నాము. వాళ్ళకు ద్రవ్యోత్పత్తిసాధనములన్నీ ఉన్నాయి నైసర్గిక సంపద ఉన్నది, మెట్ట పైరులు బాగాఉన్నాయి. ఖనిజ సంపద ఉన్నది. అన్నీ ఉన్నాయి. కాని విద్యా విషయంలో మాత్రము వెనుకబడిఉన్నారు. నైజాముప్రభుత్వంక్రింద ఉండడంవల్ల ఒక్క హైదరాబాద్‌లోనే College లు, విశ్వవిద్యాలయము పెట్టారే గాని, పల్లెటూళ్ళలో ఎక్కడా లేవు. వరంగలులో మాత్రం Second Grade College ఉండేది. ఇప్పుడు అది First Grade College అయిందని విన్నాను. ఇక్కడ మనం ప్రతి జిల్లాలోను First Grade Colleges పెట్టుకొన్నాము. తెలంగాణాలో మొత్తం 50 High Schools కంటె ఎక్కువలేవు. ఇక్కడ ఒక్క గుంటూరు జిల్లాలోనే 150 High Schools ఉన్నాయి. "మీ రిన్ని Colleges పెట్టారు ? ఇన్ని High Schools పెట్టారు ? ఏమి చేస్తారు ? " అని నన్ను కుంబ్రా అడిగాడు. "Graduates ను produce చేస్తాము. మీ యింట్లో నౌకర్లుగాకూడా graduates నే తీసుకువస్తామని " సమాధానం చెప్పాను. కనుక విద్యావిషయంలో మనం చాలా అభివృద్ధి చెందాము.

ఇక్కడ మనం ఇదివరకే prohibition పెట్టాము. అక్కడ ఒక్కసారిగా కల్లు సారా అమ్మకం తీసేస్తే Budget లో చాలా లోటుఉంటుంది. అందువల్ల కల్లుసారా అమ్మకం క్రమంగా తీసివేయాలి.

మన ఆంధ్రరాష్ట్రంలో నీటితీరువా, భూమిశిస్తు చాల తక్కువగ ఉన్నది. అక్కడ మనకంటె రెట్టింపు ఉన్నది. ఇక్కడ average మీద 10 రూపాయలు ఉంటే అక్కడ 20 రూపాయలు ఉన్నది. కనుక వాళ్ల Budget ను, మన Budget ను సరిచూచుకొని మార్చుకోవాలి.

అక్కడ Urdu నిర్బంధ భాషగా, రాజ్యభాషగా ఉన్నది. కాబట్టి దానిని కూడా కాపాడవలసి ఉన్నది. ఉద్యోగస్థుల విషయంలోకూడా తేడాలు ఉన్నాయి. వాటన్నిటిని మనం ఒప్పుకొన్నాము.

దీనినంతా కాపాడడం కోసమని Regional Committee ని President గారే చేయడం దానికి rules of procedure నిర్ణయించడం, ఏవైనా తగాదాలు వస్తే గవర్నరుకు special responsibility ఇవ్వడం మొదలైనవి పెట్టారు.

ఇంకొక ముఖ్యమైన విషయం మాతృభాష గురించి. ఏకభాషా రాష్ట్రం నిర్మించినప్పటికీ ప్రతిచోట రెండోవిధమైనటువంటి మాతృభాషగలవారు ఉండి తీరుతారు. మన రాష్ట్రంలోను ఉంటారు. మనవాళ్ళు ఇంకో రాష్ట్రంలోను ఉంటారు. అందువల్ల Constitutions ప్రాథమికవిద్యమాత్రం మాతృభాషలో నిర్బంధంగా చెప్పేటట్లు ఏర్పాటు చేశారు. ఇవన్నీ మనం అనుకొంటున్నవే. Constitution amendments అన్నీ మనం ఒప్పుకొన్నవే.

High court జడ్జీల సంగతి, జీతాల సంగతి, అవన్నీ Chief Minister గారు చెప్పారు. అవన్నీ Administration కు సంబంధించినవి.

రెండు States కు కలిపి Common Governor ఉండవచ్చు అన్నారు, Common High court ఉండవచ్చు నన్నారు. అవన్నీ పెద్ద రాష్ట్రానికి సంబంధించినవి, అవసరమైతే పెడతారు. 32 మిలియన్ల జనాభా ఉన్నటువంటి మన రాష్ట్రానికి పెట్టరు. కనుక వాటితో మనకు సంబంధంలేదు.

గోపాలకృష్ణయ్యగారు చెప్పినదానితో నేను ఏకీభవిస్తున్నాను. మనకు రావలసినటువంటి తెలుగుభాగాలుఉన్నాయి. ఇంతవరకు ఆంధ్రరాష్ట్రంలో ఉన్న అన్నిపార్టీల ప్రజలు, ప్రభుత్వము కలసి, హైదరాబాద్‌లో కొంత అభిప్రాయ భేదము వచ్చినప్పటికి చాలా పట్టుదలతో పనిచేసి ప్రజలయొక్క అభిప్రాయాన్ని హర్తాళ్ ద్వారా, telegram ల ద్వారా వ్యక్తీకరించి విశాలాంధ్రను సంపాదించుకొన్నాము. ఇంకా మనకు రావలసిన తెలుగుభాగాలు ఉన్నాయి. వాటన్నిటిని ఏకరువు పెట్టవలసిన అవసరంలేదు. చాందాలో సిరివంచ తాలూకా, ఒరిస్సారాష్ట్రంలోని పర్లాకిమిడి, కోరాపుట్టి మనకు రావలసిఉన్నవి. అట్లాగే మైసూరులో కోలారు, బళ్లారిలో కొంతభాగము మనకు వచ్చితీరాలి. ఈ పోట్లాట మనం విడిచిపెట్టామని ఎవరైనా అనుకుంటే పొరపాటు. వీటియందు మనకుఉన్న హక్కులను వదలిపెట్టలేదు. తుంగభద్ర విషయంలో అడిగాము. అది పోయింది. మళ్లీ దానిని revise చేసినా లాభము ఉండకపోవచ్చు. మద్రాసురాష్ట్రంలోని పొన్నేరి, చెంగల్పట్టు మనకు రావలసిఉన్నది. ఒకవేళ తిరుత్తణిలో కొన్నిగ్రామాలు పోయినా అభ్యంతరములేదు. హోసూరుకూడా మనకు రావాలి.

**Boundaries** విషయంలో నేనొకమాట మనవిచేయ దలచుకొన్నాను. ప్రక్కన ఉన్నటువంటి తమిళులతో, కర్నాటకులతో, మహారాష్ట్రులతో, హిందీ భాష మాట్లాడే వారితో, ఒరియలతో, అందరితోకూడా మనఆంధ్రులము స్నేహంగా ఉండదలిచాము. మనమంతా భారతదేశ పౌరులము. ఒకజాతికి చెందినవాళ్లము. స్నేహపూర్వకంగా మనకు రావలసినటువంటి భాగాలను అడుగుదాము అట్లా రాకపోయినట్లైతే **Boundary Commission** ను వేయవలసిందనిన్నీ మధ్యవర్తిత్వం ఏర్పాటు చేయవలసిందనీ ఇండియా గవర్నమెంటు వారిని కోరుతాము.

ద్రవిడ కజగం అనేటటువంటివాళ్లు అరాచకమైన ఉద్యమాన్ని ప్రారంభించారు. సత్యాగ్రహం తప్పని మనకు ఇదివరకే తెలుసు. సత్యాగ్రహంవల్లనే బొంబాయిలో నష్టపడ్డారు. ద్రవిడకజగంవాళ్లు సత్యాగ్రహం చేస్తారని ఆంధ్రులు భయపడి, లొంగిపోయి తిరుత్తనిని వాళ్లకిచ్చేందుకు ఒప్పుకుంటారనే అభిప్రాయం సరైనదికాదు. మనగవర్నమెంటు దానికి ఒప్పుకోదు. మనమంత్రులు ఏవో కొన్ని **Principles** మీద మద్రాసు రాష్ట్రంలోని చెంగల్పట్టు, సేలం, ఉత్తరార్కాటు మొదలైన జిల్లాలలోని కొన్నిప్రాంతాలను అడిగినారు. ద్రవిడ కజగంవాళ్లు కోరారుగనుక తిరుత్తని వాళ్లకు అప్పజెప్పుతారని అనుకోవడం చాల పొరపాటు.

ఇటువంటి అరాచకోద్యమాన్ని వెంటనే అణచివేయవలసిందని నేను మద్రాసు వర్నమెంటువారిని కోరుతున్నాను. దీనివల్ల ఏమిలాభంలేదు. ఇక్కడ కూడా ఎవళ్లయినా తెలిసిగాని, తెలియకగాని అటువంటి ఉద్యమాలు ప్రారంభిస్తే మేము బాధ్యులముకామని ఈ సభలోనుంచే నేను మద్రాసు గవర్నమెంటుకు సలహా చెప్పుతున్నాను. మనప్రాంతాలన్నీ సక్రమంగా మనకు వస్తాయనే నమ్మకం ఉంది. అందువల్ల ఈబిల్లును ఒప్పుకోవలసిందని నేను సభవారిని కోరుతూ విరమిస్తున్నాను.

SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా ! సుమారు 25 సంవత్సరములనుండి ఈ భాషారాష్ట్రముగురించి ఆందోళన చేస్తున్నాము. నేటికి ఇది సిద్ధించడం చాలా సంతోషకరం. 24 సంవత్సరములనుండి ఆందోళనచేసిన ఫలితంగా ఈనాడు యిది సిద్ధించినందుకు, ఒక **Silver Jubilee Celebrabation** గా మనమొక ఉత్సాహం పొం వలసిందేగాని, కొన్ని కొన్ని కారణాలచేత ఆవిధంగా చేయడానికి వీలులేకుండాపోతున్నది. 1930 సంవత్సరంలోనే మన అఖిల భారత కాంగ్రెస్ సంఘమువారు భాషారాష్ట్రాలు కావాలని కోరారు. కాని ఇప్పుడు

మాత్రము అవిధంగాచేయడం ప్రజల ఐకమత్యానికి భంగంగా ఉంటుందనే ఉద్దేశంతో ద్విభాషారాష్ట్రాలుగానో లేక మూడు రాష్ట్రాలుకలిపి ఒకటిగానో ఉంటే బాగుంటుందని మన కాంగ్రెసులోని అగ్రనాయకులు స్థిరపరచారు. వారు ఆశించింది ఒకటి, జరిగేది ఇంకొకటి. ఐకమత్యం చేకూరుస్తాం. దేశంలో సమైక్యత కలుగజేస్తాం అని సంకల్పన చేస్తారేగాని జరిగేది మరొకటి. ఐక్యతలేనటువంటి విదేశాలలో శాంతిని నెలకొల్పాలని ప్రయత్నం చేస్తూ, శాంతిప్రబోధముచేస్తున్నటు వంటి మనదేశంలోకూడ శాంతిలేకపోవడంఅనేది అనేక అల్లరులకు దారితీస్తున్నది. ఉదాహరణకు బొంబాయి విషయము తీసుకోండి. బొంబాయినగరం population basis మీద అయితేనేమి, తదితర కారణాలవల్ల నైతేనేమి, మహారాష్ట్రంలో చేరాలని అధికసంఖ్యాకులు, Corporation కూడ కోరినప్పటికిని, దానిని మొట్ట మొదట కేంద్రపాలిత నగరంగా ఉంచడానికి ఎందుకు సంకల్పించారో తెలియదు. దానిమూలాన అనేక అల్లరులు బయలుదేరి, పోలీసుకాల్పులుకూడ చేయవలసి వచ్చింది. అప్పుడు పోలీసుకాల్పులు చాలా అక్రమంగా, దారుణంగా చేసినారు. అది బ్రిటిష్‌వాళ్లుచేసినదానికంటేకూడ దారుణంగా చేసినందువల్ల, కాంగ్రెస్ యొక్క పరిపాలన బ్రిటిష్‌పరిపాలనకంటె అధ్వాన్నంగాఉన్నదని చెప్పడానికి విచారిస్తున్నాను.

Mr. SPEAKER :— What is the use of criticising the Bombay Government?

SRI M. SATYANARAYANA RAJU :— ఈవిషయము దేశమంతటికి సంబంధించింది కాబట్టి మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER :—We are not discussing the country as a whole.

SRI M. SATYANARAYANA RAJU :— ఎందువల్ల చెప్పుతున్నానంటే, దేశంలో ఐక్యత కల్పించాలనే ప్రయత్నంలో, ఆ సంకల్పముతో ఉంటున్నప్పుడు, ఇటువంటి దారుణకృత్యం జరగడం చాలా విచారకరము. ఆ తరువాత, గుజరాత్ కూడ కలిపి ద్విభాషా రాష్ట్రంగా ఏర్పరచారు. దానివల్ల గుజరాత్ సోదరులకు కొంత అసంతృప్తి కలిగింది. దానిమూలాన కొన్ని అల్లరులు కూడా జరిగాయి. కనుక ఏ విధంగా అయితే ఐకమత్యం, శాంతి నెలకొల్పుతామని ఆశించారో దానికి వ్యతిరేకంగా అవుతున్నది. 1930 వ సంవత్సరంలో ఏ విధంగా అయితే మనం తీర్మానించుకొన్నామో ఆ పద్ధతికి వ్యతిరేకంగా ఇప్పుడు మనం

నడవబట్టే, ప్రజాస్వామిక principle కు వ్యతిరేకంగా ఇప్పుడు నడవబట్టే, ఈ అశాంతి, అసంతృప్తి కలుగుతున్నది కాబట్టి మనము ముందు తీర్మానించుకొన్న విధానము అమలుజేయనంతవరకు ఈ అశాంతి ఈ అల్లరులు ఉండకమానవు. కనుక ఆ పద్ధతి ఎంత వేగంగా అమలుకు తెస్తే అంత మంచిదని చెప్పుతున్నాను.

తరువాత, border areas లోని minorities యొక్క క్షేమం కోసం Special Officer ను వేయడం అనేది చాలా సంతోషమైనవిషయము. ఈ border సమస్యలు చాలా ఆందోళనకరంగా ఉన్నాయికాబట్టి అవి ఎంత త్వరగా పరిష్కారము చేస్తే అంత శ్రేయస్కరమని చెప్పుతున్నాను. కాని ఈ సందర్భంలో ఒక విషయం చెప్పవలసి యున్నది పర్లాకిమిడి, కోరాపుట్టి జిల్లాలలో అధికసంఖ్యాకులు తెలుగువారు ఉన్నప్పటికి కూడ, కేంద్ర ప్రభుత్వంవారు వారిని మన రాష్ట్రంలో కలపకుండా అలాగే విడిచిపెట్టడమనేది చాలా విచారకరము. తరువాత బళ్ళారి విషయంలో కూడ ఒక principle అనేది పాటించకుండా దానిని మైసూరులో కలిపివేయడం జరిగింది. Administrative facilities అనే principle తీసుకొన్నట్లయితే బళ్ళారి మనకు రావలసియుంటుంది. లేదా population basis తీసుకొన్నా మంటారా, ఆ విధంగా అయితే తెలుగువారు అధికసంఖ్యాకులుగా ఉన్న కోలారు అయినా మనకు రావలసి యుంటుంది. కనుక ఏ principle అనుసరించినప్పటికినీ, మనకు ఆ రెంటిలో ఒకటి రావలసియుంటుంది. ఇదివరకు కోలారు మైసూరులో ఉన్నది, administrative facility కోసం అది అక్కడే ఉంచినప్పుడు, అదేకారణం చేతనే బళ్ళారిని కూడ ఆంధ్రలోనే ఉంచవలసియుంటుంది. అటువంటి ప్రతిపాదన గాని, principle గాని ఏమీ లేకుండే, ఏదో మైసూరునాయకులు ఒత్తిడి చేసినందు వల్లగాని లేక మననాయకులనుండి ఒత్తిడిలేకపోవడంవల్లగాని బళ్ళారిని మైసూరుకు ఇవ్వడంజరిగింది అంటే, కోలారువచ్చేంతవరకు ఆంధ్రులు ఊరుకోరు. అది కాకపోతే ఆంధులలో కూడ అశాంతి ఎక్కువఅవుతుంది. తరువాత, Zonal Councils అనేవి ఏర్పాటు చేస్తున్నారు. అది దేశ సమష్టి క్షేమంకోసమని చెప్పుతున్నారు కాని ప్రస్తుతపరిస్థితులలో ఇది చాలాఖర్చుతో కూడుకొనినటు వంటిదిగా ఉన్నది. ఎందువల్లనంటే, ఆ Zonal Councils కు సంబంధించి ఆఫీసులు ఏర్పాటుచేయడం దానికి సంబంధించిన ఆఫీసర్లు, మంత్రులు, వీరందరిని నియమించడం, ఇదంతా చాలా ఖర్చుతో కూడుకొనినటువంటి వ్యవహారంగా కన్పడుతున్నది. మనదేశంలో ఐకమత్యమనేది అంత వేగముగా జరిగేదికాదు. కాబట్టి మన దేశం ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను అభివృద్ధిచెందిన తరువాతనే ఈ Zonal

Councils ఏర్పాటుచేస్తే చాలా బాగుంటుంది. ప్రస్తుతానికి ఇవి ఆపివేస్తే మంచిది.

తరువాత Legislative Council అనేదికూడ ఏర్పాటు చేయబోతున్నారు. ఇదికూడ చాలా ఖర్చుతో కూడుకొనినటువంటిది. దీనియొక్క ఫలితమేమీలేదని చాలామంది చెప్పారు. ఇది కేవలం నిష్ప్రయోజనమే కాకుండా, చాలా ఖర్చుతో కూడుకొనినటువంటిది. కనుక ఆంధ్ర ప్రదేశ్ కు Legislative Council అనేది లేకుండా చేయడం చాలా మంచిదని చెప్పుతున్నాను.

తరువాత, Constitution లో అయిదేళ్ల కొకసారి రాష్ట్ర elections జరగాలని pass చేశారు గాని ప్రత్యేకంగా ఇప్పుడు ఏడు సంవత్సరములవరకు దాని life extend చేయవలసిన అవసరమేమున్నదో తెలియకుండా ఉన్నది. Constitution ను ఆవిధంగా amend చేసి election period ను extend చేయడంఅనేది ప్రజాస్వామికానికి విరుద్ధము. కాబట్టి ఈ 5 సంవత్సరములలో కాకపోయినా, దేశము మొత్తంమీద elections ఎలాగు జరుగుతున్నాయి. కాబట్టి ఆ elections తో బాటు, మన ఆంధ్రకుకూడ, elections జరిపినట్లయితే, ప్రత్యేకంగా దీనికి వేరే ఖర్చు పెట్టినవసరం ఉండదు. ఆవిధంగా తెలంగాణా సోదరులతో మనకుకూడ elections పెట్టకపోవడం విచారకరం. ఇది ప్రజాస్వామికానికి విరుద్ధమే కాకుండా, అధిక ఖర్చులతో కూడుకొన్నటువంటిది. కాబట్టి ఈ తీర్మానం ఇష్టం లేకపోయినప్పటికి అంగీకరిస్తున్నాము.

SRI M RAJESWARA RAO :—అధ్యక్షా, ఈ Constitution యొక్క amendment ను సంపూర్ణంగా బలపరుస్తున్నాను. ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం గమనించవలసియున్నది. 'More than half the States' దీనిని ratify చేయకపోతే ఏమవుతుంది అనేది అర్థం కావడంలేదు. ఇప్పుడు half the States గనక దీనిని approve చేయకపోయినట్లయితే ఈ Constitution అమలుకు రాదు; Constitution అమలులో లేకపోతే States re-organisation కూడ అమలులోకి రావడానికి వీలులేదు. ఏదైన Constitutional difficulty ఉంటే, దానిని remove చేయడానికి Article 392 లో ప్రెశిడెంటుకు Powers ఉన్నాయి; కాని ఒకవేళ దీనిని refuse చేస్తే మాత్రము తిరిగి దీనిని ప్రెశిడెంటు pass చేయడానికి, provision ఏమీ ఈ Constitution లో కన్పించడంలేదు. కాని, ఏ పరిస్థితులలోనైనను States re-organisation అమలులోకి రావాలని అనుకొన్నాము గాబట్టి ఇది ఇష్టం

లేకపోయినా కూడ approve చేయవలసిన అవసరం ఉన్నది, అయితే, ఈ amendments అన్నికూడ దాదాపు consequential amendments, States Re-organisation Act లో మనము కొన్ని principles ఒప్పున్నాము. Constitution amendment కు దాంట్లో కొన్ని separate clauses పెట్టుకొన్నాము, అందుచేత వీటిని Constitution లో incorporate చేయవలసి యున్నది కాబట్టి దీన్ని గురించి క్రొత్తగా discuss చేయవలసిన అవసరమేమి కన్పించడం లేదు. కాని ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఒకటి రెండు విషయాలు చెప్పదలచుకొన్నాను.

మనకు యీనాటి States Re-organisation Act ను పురస్కరించుకుని Constitutional amendment జరగడమువల్ల దేశములో చాలా విప్లవాత్మకమైన మార్పులు రానున్నవి. మనము ఎంతోకాలమునుంచి linguistic basis మీద ఉమ్మడిరాష్ట్రాలనుంచి విడిపోవాలని అనుకుంటూయున్నాము. కాని యిప్పుడు Linguistic Provinces ఏర్పడుతున్న సమయములో మరల మనకు యీ linguistic Provinces అక్కరలేదనేభావము కలగడమువల్ల మరల అందరము కలసిపోవాలని ఉద్దేశ్యము కలుగుతున్నది. వివిధరాష్ట్రాలలో ఉన్న ప్రజలభావాలన్నీ సమన్వయము కావటానికే యీ బిల్లు రావడము తటస్థించుచున్నట్లు కన్పిస్తున్నది. ఈ principle ను మనమందరము accept చేస్తున్నందువల్లనే, బొంబాయి, Gujarat, మహారాష్ట్రము యీ మూడింటిని కలిపి ఒకేరాష్ట్రము ఏర్పడుతున్నది. మనకు ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పటికినీ మరల మనమందరికీ Bi-lingual State అనో, Multi lingual State అనో ఒకే రాష్ట్రముగా ఒకేభావ, ఒకే సిద్ధాంతముమీద అందరము ఏకీభావముతో పోవాలని అనుకుంటున్నందువల్ల, దీనికి చాలా అభినందించవలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను. అయితే యీ States Re-organization వల్ల దేశములో చాలా గొప్పమార్పులు కన్పిస్తున్నవి. దీనివల్ల మన హిందూదేశములో ఉన్న ప్రజలందరూ, ఏభాషవారైనప్పటికినీ, అందరమూ భారతీయులమే, మనమందరము ఒక్కత్రాడుమీద నడవటానికి ఒక్క సిద్ధాంతమునే బలపరచటానికే యీ రోజున India Constitution లో క్రొత్త మార్పులు తీసుకునివచ్చియున్నారు. కారణ మేమిటంటే ఒకే రాష్ట్రానికి ఒకే గవర్నరుకాకుండా, రెండు, మూడు రాష్ట్రాలకు ఒకే గవర్నరును పెట్టుకోవచ్చునన్నారు. అదేవిధముగా రెండు మూడు రాష్ట్రాలకు ఒకే హైకోర్టుకూడ ఉండవచ్చునంటున్నారు. ఈ విధముగా దేశములోని రాష్ట్రాలన్నీ సమన్వయపరచటానికి Zonal Councils ను ఏర్పాటుచేస్తున్నారు, ఈనాడు ఏర్పడే Bigger

Bombay రాష్ట్రముచూస్తే మనము అందరముకూడ, మనకు ఎన్ని భాషలవారున్న ప్పటికినీ, మనమందరము భారతీయులమేనన్న భావము కలగటానికి, ఈ భాషవారు, ఆభాషవారు అనే distinction లేకుండా అందరూ ఒక్కటే అనేభావము కలగ టానికి యీ zonal councils ఏర్పాటుతో యీ బిల్లు దోహదము కలుగచేస్తున్నది. దీనికి కేంద్రప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అయితే, యీ విషయములో మన గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు, ఒక్క విషయముమాత్రమునాకు కనబడుతున్నది Linguistic minorities యొక్క interests కాపాడటానికి ఒక separate article ను పెట్టారు. దానిప్రకారము ఒక కమిటీ ఏర్పాటు చేయబడుతుంది. ఆ కమిటీ ద్వారా దేశములో ఉన్న minorities యొక్క అవసరాలను నివేదించటానికి ఒక రిపోర్టును తయారు చేయించి, ఆ రిపోర్టును పార్లమెంటుయొక్కయు, States యొక్కయు ఆమోదము పొందటానికి అవకాశము కల్పించారు. దీనివల్ల ఏ రాష్ట్రములోనైనా ఎవరైనా minority జాతివారు ఉంటే, వారికి ఉన్నటువంటి భయములు తొలగించటానికి యిందులో కన్పిస్తున్నది. మనదేశములో ఎంతో కాలమునుంచి ఏదో రాజప్రముఖ్ అని, ఏదో సార్వభౌమాధికారము ఉన్నవారు ఉంటున్నారు. ఇప్పుడు ఈ బిల్లుద్వారా వారందరు పోయినారు. ఇది గాక A. States అని, B. States అని, యిలాంటి distinction కూడ అన్ని రాష్ట్రాలు కూడ equal footing లో ఉండటానికి అవకాశము ఏర్పడుతున్నది. అయితే యిందులో ఒక్కటి బాధకరమైన విషయము కన్పిస్తున్నది. అది యేమిటంటే ఒక రాష్ట్రములో ఉన్న functions, మరొక రాష్ట్రములో నిర్వహించబడే functions కొన్ని నిర్వహించడానికి ప్రత్యేక పరిస్థితులలో గవర్నరు కేంద్ర ప్రభుత్వానికిగాని, కేంద్రప్రభుత్వము తన అధికార్లకుగాని ఒప్పచెప్పి నిర్వహింప చేయటానికి అవకాశము ఉంటున్నది. ఈలాంటి contingencies వస్తాయని వారు ఎందువల్ల అభిప్రాయపడ్డారో అర్థము కావడములేదు. బహుశా యీ Zonal Councils ఏర్పడినందువల్ల ఒక రాష్ట్రానికి, యింకొక రాష్ట్రానికి మధ్య Administration లో difficulties రావచ్చు. అవి అన్నీ పరిష్కరించటానికి గవర్నరుకు వీలుకాకపోతేగాని, తనకు యిష్టము లేకపోతేగాని, అవి కేంద్ర ప్రభుత్వానికి entrust చేయటానికి వీలుగా provision కల్పించారేమో నను కుంటాను. ఈ మధ్య యీ విషయములో మద్రాసుస్టేటులోనూ, యితర States లోను వారివారికి ఉన్న అభిప్రాయాలు ప్రకటించారు. అయితే యిది ఒక convention గా మాత్రము ఒప్పుకుంటారని అనుకుంటున్నాను. అయితే యివి

ఏదో అసాధారణ పరిస్థితులలోతప్ప, గవర్నరు సాధ్యమైనంతవరకు రాష్ట్ర ప్రభుత్వము యొక్క సలహాలు తీసుకోకుండా చేయడని నా అభిప్రాయము. రాష్ట్ర ప్రభుత్వము నిర్వహించే functions ను తాను నిర్వహించాలిగాని Central Government ఉద్యోగ స్థులకు ఏపరిస్థితిలోనూ entrust చేయరని నేను ఆశిస్తున్నాను. ఇవి మన అభిప్రాయాలు కాబట్టి, అధ్యక్షులవారు యీ అభిప్రాయాలన్నీ పార్లమెంటుకు, ప్రెసిడెంటుగారికి అందజేస్తారని ఆశిస్తున్నాను. Boundary Commission ఏర్పాటుచేసే విషయములో ఒక్కసంగతిమాత్రము మనవిచేసి సెలవు తీసుకుంటాను. ఈ Boundary Commission విషయములో ఏవోకొన్ని amendments పెట్టబడినవి. ఈ Boundaries settlement విషయములో మనకు నిర్ణీతమైన అభిప్రాయాలు ఉన్నవి. ఉదాహరణకు మనరాష్ట్రానికి మద్రాసురాష్ట్రానికి మధ్య ఉన్న boundary disputes విషయములోనే అభిప్రాయభేదాలు కలిగినవి. మద్రాసు ప్రభుత్వానికి ఒక దృక్పథము ఉన్నది. ఇక్కడ మనకు వేరే దృక్పథము ఉన్నది. ఆంధ్రప్రభుత్వము యొక్క దృక్పథముతో మేము సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాము. ఈరాష్ట్రాలు రెండు linguistic basis మీద విడిపోవడము జరిగింది. ఈ boundary disputes ఒకే సిద్ధాంతముమీద పరిష్కరించబడితే బాగా ఉంటుందనే అభిప్రాయము మన ప్రభుత్వానికి ఉన్నట్లు కన్పిస్తున్నది. కాని దురదృష్టవశాత్తు యీమధ్య ఆర్థికమంత్రి సుబ్రహ్మణ్యంగారు అక్కడ ఎసెంబ్లీలో మాట్లాడుతూ, యీ disputes settlement యితర రాష్ట్రములతో ముడిపెట్టటానికి వీలులేదనిన్నీ, యివి ప్రత్యేకంగా treat చేస్తూ పరిష్కరించాలనిన్నీ కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడి చేస్తున్నట్లుగా ప్రకటించారు. వారు యీవిధముగా ప్రకటించడము శోచనీయముగా ఉన్నది. చిత్తూరుజిల్లాలో ఉన్న ఆంధ్రులు సుమారు నాలుగు, అయిదువందలమంది యీ boundary disputes విషయములో arrest కావడము, తిరుత్తని, దాని పరిసరప్రాంతాలు ఆంధ్రలోనికి రావాలని agitate చేయడము మూలంగా ఎసెంబ్లీలో debate జరగడము చాలా దురదృష్టకరమైన విషయము. అందువల్ల యిక్కడ ఆంధ్ర ప్రభుత్వము యొక్క అభిప్రాయాన్నే మేము బలపరుస్తున్నాము ఈలాంటి boundary disputes అన్నీకూడ ఒకే సిద్ధాంతముమీద సామరస్యముతో పరిష్కరింప చేసుకోటానికి కేంద్రప్రభుత్వాన్ని కోరవలసిందిగా విజ్ఞప్తిచేస్తున్నాను.

మనము కొత్తరాష్ట్రములోకి వెళ్లబోతున్నాము. ఈ రాష్ట్రముకొరకు మనము ఎంతోకాలముగా ఎన్నో త్యాగాలు చేస్తూ కృషిచేశాము అది యీనాటికి

ఫలించింది. మనకు యీనాడు ఆంధ్రప్రదేశ్ అనేపేరుతో విశాలాంధ్ర ఏర్పడుతున్నదేకాని, మనకు ఏర్పడవలసిన పూర్తిరాష్ట్రము మాత్రము ఏర్పడలేదు. మనకు సంపూర్ణముగా రావలసిన అన్ని ఆంధ్రప్రాంతాలు కూడా రావటానికి కృషిచేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. మనకుఉన్న రాష్ట్రాలలో ఆంధ్రప్రాంతాలు ఎన్నోరాకుండా మిగలిపోయి యున్నవి. అక్కడ ఆంధ్రులంతా ఏనాడు మనము మనఆంధ్రలోకి చేరుకుంటామా అని ఆశతో ఎదురుచూస్తున్నారు. మనకు Boundary Commission ఏర్పాటు చేసినప్పుడు మనకుఉన్న boundary disputes అన్నీ ఆ కమీషనుద్వారా సామరస్యపూర్వకముగా పరిష్కరింపజేసుకోటానికి, మనకు రావలసిన ఆంధ్రప్రాంతాలన్నీ రావడానికి కృషిచేస్తారని ఆశిస్తున్నాను. మనము నూతనరాష్ట్రమునకు వెళ్లుతున్నపుడు నూతనదృక్పథముతోనే వ్యవహరించవలసి ఉంటుంది. ఇప్పటివరకూ మనము ఏదోఒక పద్ధతిలో నడిచాము. ఒకసిద్ధాంతముమీద నడిచాము. నూతనరాష్ట్రములో నూతన ఆశయాలతో సృజనాత్మకమైన దృక్పథముతో వ్యవహరించవలసిన అవసరమున్నది. నాకు యీసందర్భములో యేసుక్రీస్తు చెప్పినసంగతి ఒకటి Bible లో చదివినది జ్ఞాపకమునకు వస్తున్నది. ఏదో పాతతిత్తులలో కొత్తరసముపోస్తే, ఉన్నతిత్తులుకాస్తా ఊడిపోతాయట. అదేమాదిరిగా ఉన్నవిపోగొట్టుకోకుండా, మనకు రావలసిన ఆంధ్రప్రాంతాలన్నీ సంపూర్ణముగా సంపాదించుకోటానికి కృషిచేయమని విజ్ఞప్తి చేస్తున్నాను. మరియు ఇప్పటివరకూ మనము ఏపపరిస్థితులలో ఏపదృక్పథంతోటి వ్యవహారాలన్నీ దిద్దుకుంటూ వస్తున్నామో, నూతనరాష్ట్రములోనికి వెళ్లినప్పుడు దానియొక్క అభివృద్ధికి ఎక్కువగా కృషి చేయాలని అంటున్నాను. మనము యిదివరకు ఉన్న దృక్పథముతోనే క్రొత్త రాష్ట్రములోకూడ వ్యవహరించేటట్లయితే, క్రొత్త రాష్ట్రమును మనము అభివృద్ధికి తెచ్చుకోలేము. కాబట్టి మనకు కొత్త నాయకుడు, క్రొత్త ప్రభుత్వము రావాలని యీ బిల్లులో provision కూడ కల్పించబడిందనే విషయము మనకందరికీ తెలుసును. అందువల్ల మన నాయకులందరూ యీ విషయమును జాగ్రత్తగా ఆలోచించి, మనకు యింతవరకూ ఏలాంటి దృక్పథము ఉన్నదో, యిక మీదట అందులో ఏ ఏ మార్పులు చేసుకోవలసి ఉంటుందో, అవి అన్నీ బాగా ఆలోచించి, మనకు ఉన్న ఆశయములన్నీ నెరవేర్చుకోటానికి అందరూకూడ కృషి చేస్తారని ఆశిస్తు యీ Consitituna amendment కు సంబంధించిన బిల్లును నేను సంపూర్ణముగా బలపరుస్తూ సెలవు తీసుకుంటున్నాను.

# RATIFICATION OF THE AMENDMENTS PROPOSED TO BE MADE TO THE CONSTITUTION OF INDIA BY THE CONSTITUTION (SEVENTH AMENDMENT) BILL, 1956

30th September 1956 ]

SRI S. VEMAYYA :—అధ్యక్షా. ఇప్పుడు శాసన సభ్యులు చెప్పినట్లుగా కొంతమంది ఆంధ్రులు చిత్తూరు జిల్లాకు వెళ్ళి సత్యాగ్రహాలు చేయడము, వారిలో కొంతమంది arrest కావడము,యీ విషయాన్ని గురించి మొన్న మొన్ననే మనము పత్రికలలో చూచాము. దానిని అధిగమించటానికి ప్రభుత్వము త్వరలోనే చర్య తీసుకుని, కేంద్ర ప్రభుత్వాన్ని సంప్రదించి, మనకు రావలసిన ఆంధ్ర ప్రాంతాలు వచ్చేటట్లుగాను, Boundary Commission ద్వారా ఆ dispute లన్నీ పరిష్కరింప చేసుకోటానికి ఏదైనా ఒక మార్గము అన్వేషించ వలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇక్కడ ప్యాసు చేసినటువంటి బిల్లు సందర్భములో, ముఖ్యంగా మన ఆంధ్ర, తెలంగాణాలకు మధ్య కొన్ని Controversies బయలుదేరినవి. అవి ఎంతో కాలముగా ఉంటూన్నవి. అవి త్వరలో మిళితము అయిపోతే బాగా ఉంటుందేమోనని అభిప్రాయ పడుతున్నాను. అంతేకాకుండా మన ఆంధ్రరాష్ట్రము ఒక్క టే తీసుకుంటే మనలో కొంతమంది ఎన్నికలలో పాల్గొనడము, కొంతమంది ఎన్నికలు లేకుండానే మరొక విధముగా చట్టరూపేణా పొడిగించుకుంటే బాగాఉండేదేమోనని అనుకుంటున్నాను. మనము ఏదో విధముగా ratify చేసేదే కాబట్టి యీ democratic principles కు అంత అనుగుణముగా ఉండదేమోనని అనిపిస్తున్నది. ఇదిగాక యిక్కడ మనరాష్ట్రములో prohibition అమలు పరుచుకుంటున్నాము. అక్కడ మనలో చేరబోయే తెలంగాణాలో prohibition అమలు పరచబడడము లేదు. దీనివల్ల రెండింటికి పరస్పర విరుద్ధము కనబడుతున్నది. ఒకే రాష్ట్రములో ఒకచోట prohibition ఉండడము మరొకప్రాంతములో లేకపోవడము అంటే, యిది ఏమంత సబబుగాలేదని చెప్పవలసి వస్తున్నది. ఇంతేకాకుండ భూముల విషయములో అమ్మే విషయములోగాని, వేలము వేసే విషయములోగాని, అక్కడ ఒక కమిటీకూడ ఏర్పాటు చేయబడినట్లు తెలుస్తున్నది.

Mr. SPEAKER :—These are all matters relating to Andhra Pradesh. That Assembly will deal with those matters and not this Assembly.

SRI S. VEMAYYA :—అందువల్ల ప్రత్యేకంగా కమిటీలు, Regional Committee, సర్వీసెస్ విషయములోకూడా మొన్న మొన్ననే మన ముఖ్యమంత్రి గారు కొంతకాలమువరకూ ఆ కమిటీలు ఆ ప్రాంతానికి ప్రత్యేకంగా వ్యవహరిస్తే బాగా ఉంటుందని చెప్పారు. ఆ ప్రత్యేకత అనేది ఎంతదూరము తీసుకొని వెళ్లుతుందో, యింకా అక్కడ administration విషయములోగాని, యితర

విషయములోగాని ఎంతవరకు అది ఉపయోగిస్తుందోగాని, అది సందేహాస్పద ముగా ఉన్నది. పైగా language విషయము తీసుకుంటే వారికి ఉర్దుభాష కావా లని, మనము యిక్కడ తెలుగు కావాలని, యీ యిద్దరికీ మధ్య అందుబాటుగా ఇంగ్లీషుభాష ఉంటే బాగా ఉంటుందని, యీ విధముగా మూడు భాషల క్రింద administration విభజించుకుంటూ ఉండడము ఎంత సౌమ్యముగా ఉంటుందో చూడాలి. ఈ విధముగా జరిగేటట్లయితే, యిది ఒకదాని కొకదానికి ఏమాత్రము సంబంధము లేకుండాపోయే పరిస్థితులు ఏర్పడి, ఎక్కడికక్కడ, ఏ ప్రాంతాని కాప్రాంతము విడిపోయేటట్లుగా నాకు సందేహముగా ఉన్నది. ఈవిధముగా జరగకుండా ప్రభుత్వము త్వరలో తగు చర్య తీసుకోవాల్సి ఉంటుంది. ముఖ్యంగా యిప్పుడు మనముందర ఉన్న Amending Bill ను గురించి ఆలోచించవలసిన విధానము ఒకటి ఉన్నది.

ఈ అమెండుమెంటు బిల్లులో Ligislative Council అన్నదొకటి ఉన్నది. దానిలో సభ్యులసంఖ్యను 1/4 నుంచి 1/3 చేసినారు. ఎన్నికలలో defeat అయిన వానిని మరొకవిధముగా తీసుకురావడానికి ఈ ఏర్పాటు జరుగుచున్నదిగా కనబడు చున్నది. అయితే కొంతమంది చెప్పవచ్చును. విద్యార్థికులు వారు ఎన్నికలకు నిలవరు కాబట్టి అలాంటివారికి అవకాశములు కల్పించడానికి అని అనవచ్చును. అనేకదేశాలలో ఈనాడు పరస్పర విరుద్ధమైన institutions ఉండకూడదని అంటు న్నారు. వారు ప్రత్యేకంగా చేసేది ఏమీ ఉండదు. ఇక్కడ ప్యాసుచేసినదానిని విమ ర్శించడము తప్ప. కాబట్టి దానిఅవసరంలేదు. కాబట్టి ఈ విధానము సాధ్యమైనంత వరకు తొలగిస్తే బాగా ఉంటుంది అని మనవిచేస్తూ శలవు తీసుకుంటున్నాను.

SRI N. VENKAIAH :— అధ్యక్షా, ఈనాడు ఆంధ్రలో ఈ బిల్లుకు స్వాగతం ఇస్తారు. ఇంతకాలంనుంచి కోరుతూఉన్నవారి కోరిక నేడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడడముతో చాలావరకు పూర్తి అయినది. గాని ఇంకా మనకు చేరవలసిన భాగ ములు దాదాపు 20,000 square miles, 30 లక్షల జనాభా భాషాప్రాతిపదికను అనుసరించి మనలో చేరవలెనని అన్నాము అనే విషయము మరచిపోకూడదు. ఈ రోజున మనకు చాలాఅన్యాయం జరిగింది. భాషా ప్రాతిపదికను అనుసరించిగాని, ఫజలు అలీ కమిషను రిపోర్టును అనుసరించిగాని ఈ రాష్ట్రములో ఆదిలాబాదు రెండు తాలూకాలు, చివరులో ఇంకా 6 తాలూకాలు, బళ్ళారి 4 తాలూకాలు మనతో చేరిఉండేవి. గాని మన ప్రభుత్వం సమర్థనీయంగా వ్యవహరించలేదని నేను

విచారిస్తున్నాను. మైసూరుప్రభుత్వం చాలా జాగ్రత్తగా Datar ద్వారా తనపని జరిపించుకొంది. మనము ఇండియా ప్రభుత్వ దృష్టికి సరైన సమాచారం తీసుకొని రాలేదు అనే అనుమానం పడుతున్నాను. ఈనాడు మనతో కలవని ఆంధ్రులు తమ స్థితి ఏమిటి అని ఆలోచిస్తున్నారు. అలాగా మనకు ముందుముందు కొన్ని reservoirs, విద్యుచ్ఛక్తి స్కీములు అమలు జరపడానికి మనభాగములు మనకు రాకపోవడము మనకు ఎంతో బాధగా ఉన్నది.

ప్రాంతీయ సంఘములు ఏవో ఏర్పాటుచేస్తున్నారు. వాటి ఉపయోగము ఏమిటో నాకు బోధపడములేదు. మన భాషలవారితోను, సరిహద్దులవారితోను వ్యవహరించడానికి మనము సర్దుబాటులుచేసికొనడానికి ఆ ప్రాంతీయ సంఘములు ఉపయోగపడతాయి అంటే అవి కేవలం మద్రాసురాష్ట్రముతో వ్యవహరించడానికి ఉపయోగపడవచ్చును. గాని మన ప్రక్కన ఉన్న మైసూరురాష్ట్రము బొంబాయి ప్రాంతీయ సంఘములో చేరుతూఉంది. అలాగా మన పొరుగునఉన్న మహారాష్ట్రం అటు ఉండబోతున్నది. ఒరిస్సారాష్ట్రము Eastern ప్రాంతములో చేరబోతున్నది. కాబట్టి వాటి ఉపయోగము ఉండదు. మన ప్రాంతాలను అన్నింటిని మనతో చేర్చి నప్పుడే వాటివల్ల ఉపయోగపడవచ్చును. ఇండియాగవర్నమెంటు జోక్యము కల్గించుకొనడమువల్ల మనకు నష్టము కలుగుతుందనేభయము ఉన్నది. అందువల్ల ముందుముందు మన హక్కులను మనము జాగ్రత్తగా ఆచరించవలసి ఉన్నదని మనవి చేస్తున్నాను. విశాలాంధ్ర ఏర్పడుతున్నందులకు ఎంతో సంతోషము వెలిబుచ్చుతూ విరమించుచున్నాను.

SRI B. SANKARAIAH:—అధ్యక్షా, రాష్ట్రపునర్విభజనా విషయములు, ప్రజలు హర్షించే విషయములు చాలాఉన్నవి. మనదేశములో ఇంగ్లీషు ప్రభుత్వం ఏర్పర్చిన రాజకీయ ఆర్థిక ప్రతిబంధకాలను తొలగించుకొనడానికి ఇది ఒక మంచి మార్గము. ఇందుకోసము త్యాగములుచేసి ప్రాణములను అర్పించినవారికి జోహార్లు అర్పించవలసిఉన్నది. ఈబిల్లులో ప్రజాస్వామికమునకు విరుద్ధమైనవికొన్ని, దగ్గరగా ఉన్నవికూడా కొన్నిఉన్నవి. ఇందులో మనరాష్ట్రమునకుసంబంధించినవి, దేశమునకు సంబంధించినవి ఉన్నవి. వీటిని తొలగించుకొనుటకు భాషారాష్ట్రాలకు కృషిచేసి నట్లుగా కృషిచెయ్యవలసిఉన్నది. దానిలో స్వదేశసంస్థానాధీశులు, రాజప్రముఖులు లేకుండా చెయ్యడము ముఖ్యమైనవిషయము. ఈ భాషారాష్ట్రాల విభజన అందరికి సంతోషము కల్గించినది గాని కొన్ని ప్రాంతాలకు అటువంటి సంతోషములేకుండా

పోయింది. ముఖ్యముగా భాషారాష్ట్రాలకోసము అనేకత్యాగాలుచేసిన మహారాష్ట్రులు ఆనందించేభాగ్యములేకుండాపోయింది. అట్లాగనే గుజరాతీలు ఆందోళన చేయుతూ ఉన్నారు.

కొన్ని రాష్ట్రాలలో councils ఏర్పాటు చేసుకునేందుకు అవకాశములు కల్పించినారు. మన ముఖ్యమంత్రిగారు కౌన్సిలు సీట్లు 1/4 నుంచి 1/3 కు చేసినందులకు హర్షము వెలిబుచ్చినారు. ఈ కౌన్సిళ్లకు, పరపతి ఎవరైతే పోగొట్టుకున్నారో, ఎవరైతే ఓడిపోయేరో, ఎవరు రాజకీయాలలో ఊసరవిల్లిలాగున ఉంటున్నారో వారిని, దొడ్డిత్రోవను తీసుకురావడము జరుగుతుంది. ఇది కాంగ్రెసు పార్టీఉద్దేశము. ఇప్పుడు కౌన్సిలు లేనట్టు రాష్ట్రాలకు తీసుకొని రావడం ఏమాత్రము సబబు కాదు.

మన తెలుగు మాట్లాడేవారు ఇతరరాష్ట్రాలలో ఉండిపోయినారు. వారిని మనలో చేర్చుకునేందుకు సరైన principle మీద దేశ మొత్తంపైన ఈ సమస్య పరిష్కారము చెయ్యవలెనని కేంద్రప్రభుత్వమును కోరవలెను. మద్రాసులో జరుగుతున్న ఆందోళనకు జబాబుగా మనప్రభుత్వం వెంటనే సరైన లెక్కలను తయారుచేసి కేంద్రప్రభుత్వానికి నచ్చచెప్పి భాషా ప్రాతిపదికమీద గ్రామాలు basis గా తీసుకొని ఈ సమస్యను పరిష్కరించుకొనవలసిన అవసరం ఉన్నది.

ఈ రోజున దేశము అంతటా ఎన్నికలు జరుగుతూఉండగా మన ఆంధ్రలో మాత్రము ఎన్నికలు లేకుండా చేస్తున్నారు. 5 సంవత్సరములు దేశమునకు అపఖ్యాతిగా ఉంటుంది. ఇది తీసుకువచ్చినవారు ఈ 5 సంవత్సరములు ప్రజలకు జవాబు చెప్పవలసి ఉంటుది. ఈ Democratic right ప్రజలకు ఇవ్వాలని చెపుతూ విరమించుచున్నాను.

SRI T. JALAYYA :— అధ్యక్షా! రాష్ట్రపునర్నిర్మాణబిల్లుమీద మన ప్రభుత్వంవారు తెచ్చిన తీర్మానాన్ని హృదయపూర్వకంగా అంగీకరిస్తున్నాను. ఆంధ్రులందరు ఎంతో కాలంనుంచి ఆంధ్రరాష్ట్రం కావాలని ఎంతోకష్టపడిన తరువాత మూడుసంవత్సరములనాడు ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. దానిని విశాలంచేసుకునే భాగ్యం మనకు పట్టినందుకు మనం గర్వించవలసియున్నది. గోపాలరెడ్డిగారి నాయకత్వంక్రింద మనకు విశాలాంధ్రవస్తున్నందుకు అందరూ సంతోషించవలసియున్నది. ఎన్నోకష్టాలుపడి, బాధలుపడి ఈరాష్ట్రాన్ని మనం సంపాదించుకున్నాం. అందరుకలిసి పనిచేస్తే కీర్తివస్తుంది. ఆంధ్రులకు శాంతదూతలనేకీర్తి ఉన్నది. మనకు

అన్యాయంజరిగినా శాంతియుతంగా ఉన్నాము తప్ప మిగతా రాష్ట్రాల మాదిరి అలజడులు చేయలేదు. మద్రాసునగరం ఆంధ్రులది. ఆంధ్రులకు సర్వహక్కులు కలవి. అదిమనకు రాకుండాపోయినప్పటికి శాంతియుతంగా గాంధీమహాత్ముని సిద్ధాంతాను సారం ఏఅల్లరులుచేయకుండా శాంతంగా బైటకువచ్చినాము. శంకరయ్యగారు మాట్లాడుతూ ఎన్నికలుజరిపితే కాంగ్రెసు వారు ప్రజలకు సంజాయిషీ చెప్పుకోవలసి ఉంటుంది అని చెప్పినారు. ప్రజల బాగుకోసమే ఎన్నికలను ఆపాలి అని నా ఉద్దేశం. మొన్న ఎన్నికలుతరువాత ఇంతవరకు ఇంకాచేతులేఆరలేదు. అప్పుడేతిరిగి ఎన్నికలు జరిపించడం ప్రజలక్షేమం కోరడంకాదు. ప్రజల సౌభాగ్యంకోరే సుస్థిరప్రభుత్వం ఏర్పడితే ప్రజలుసంతోషిస్తారు. వచ్చే అయిదుసంవత్సరాలు సుస్థిరప్రభుత్వం ఏర్పడి ప్రజలక్షేమానికి తోడ్పడుతుందని ఆశించవలసి యున్నది. శంకరయ్యగారు కౌన్సిలు ఓడిపోయినవారికోసమని చెప్పారు. అదికాదు అసలు ఉద్దేశ్యం, అసెంబ్లీలో ఏరకంగా తీర్మానాలుచేసినా, అడ్డదిడ్డంగా pass చేసినా, కౌన్సిలులో తిరిగి పెద్దలు విచారించి ఒడుదుడుకులు లేకుండా నడిపిస్తారు అని ఉద్దేశం. అంతేకాని ఓడిపోయిన వారికోసమని చెప్పడం న్యాయంకాదు. తెలంగాణావారు విద్యావిషయంలో మనకన్న వెనకబడి ఉన్నారు. తెలంగాణా మొత్తంమీద గుంటూరుజిల్లాలో ఉన్నన్ని హైస్కూళ్లులేవు. గుంటూరులో ఉన్నన్ని కాలేజీలులేవు. తెలంగాణాలో విద్యావ్యాప్తికి మనం త్యాగం చేయవలసియున్నది. వారి మేలుకోసము మనం పనిచేసిననాడే మనకు శాశ్వతమైన కీర్తిఉంటుంది. కాబట్టి తెలంగాణాకు కావలసిన సదుపాయాలు చేయవలసి యున్నది. వారికి మనలనుచూస్తే భయం ఉన్నది. వారి భయాలను, అనుమానాలను పోగొట్టడానికి ముఖ్యమంత్రిగారు రక్షణలు ఇవ్వడానికి అంగీకరించినారుతప్ప మరొకటికాదు. హైకోర్టువిషయంలో గుంటూరుకు చాలా అన్యాయంజరిగింది. గుంటూరుకు హైకోర్టు వచ్చేముందు రిజిస్ట్రారు గారు కలెక్టరుగారు కబురుపంపి ఇన్ని ఇండ్లు అవసరం అని అడిగితే మాటుమాట్లాడకుండా మూడుగంటలసేపులో అన్ని ఇండ్లు సమకూర్చిపెట్టాము. ఇపుడు గుంటూరు నుంచి వెళ్లాయంటే వారికికూడ కష్టంగానేఉన్నది. మనకు రెండు హైకోర్టులువున్నా పరవాలేదు. 2000 writs ఉన్నాయని క్లబ్‌లో ఈ మధ్య Chief Justice గారు చెప్పారు. ఇన్ని writs pending గా ఉంటే ఒకే హైకోర్టుపెట్టడం సరికాదు. మన ప్రభుత్వంవారు గట్టిగా కృషిచేసి గుంటూరుకు ఒకబెంచి ఉండేట్లాచేస్తారని నమ్ముతున్నాను. ఈ తీర్మానాన్ని నేను మనస్పూర్తిగా సమర్థిస్తున్నాను.

## 589 RATIFICATION OF THE AMENDMENTS PROPOSED TO BE MADE TO THE CONSTITUTION OF INDIA BY THE CONSTITUTION (SEVENTH AMENDMENT) BILL, 1956

[30th September 1956

SRI G. NARASIMHA MURTHY:— అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు తీసుకువచ్చిన ఈ తీర్మానాన్ని నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. ఈ సమయంలో భారతదేశంనుంచి పరాయిప్రభుత్వాన్ని బైటకుపంపడానికి గాంధీ మహాత్ముని నాయకత్వాన సాగించిన ఉద్యమంలో త్యాగాలుచేసిన దేశభక్తులు జ్ఞాపకం వస్తున్నారు. ఆ పరాధీనతనుండి మనలను తొలగించినది కాంగ్రెసుసంస్థ. 1930 లో కాంగ్రెసుసంస్థ భాషాప్రయుక్తరాష్ట్ర విభజనగురించి తీర్మానంచేసినది మొదలు ప్రత్యేకరాష్ట్రంకోసము తీవ్రకృషి చేసినారు. తరువాత అమరజీవి పొట్టి శ్రీరాములుగారి త్యాగఫలితంగా ఆంధ్రరాష్ట్రఅవతరణ జరిగింది. అటుపిమ్మట దేశంమొత్తంమీద భాషాప్రయుక్తరాష్ట్ర విభజన అవసరమనే విషయం కేంద్ర ప్రభుత్వ దృష్టికిరావడం, వారు రాష్ట్రపునర్వ్యవస్థీకరణసంఘాన్ని నియమించడం జరిగింది. దాని ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడుతోంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతరువాత ఆంధ్రప్రజల సర్వతోముఖాభివృద్ధికి అందరూ ఆనందంతో కృషి చేస్తారు. ఈ విశ్వాసంతోనే ఈ తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను. ఈ సమయంలో మన నాయకులు చాలా జాగ్రత్తగా పనిచేశారు. సరిహద్దులలోని ఆంధ్రుల ఆందోళన కొంతలేకపోలేదు. ఈ విషయమై ఆంధ్రప్రదేశ్ ఎర్పడినతరువాత ప్రభుత్వం తగు శ్రద్ధతీసుకుని సరిహద్దు ఆంధ్రులను మనతో చేర్చుకొనడానికి కట్టుదిట్టమైన ప్రయత్నాలు సాగిస్తారని ఆశిస్తున్నాను.

SRI S. KASI REDDI :—అధ్యక్షా, మనం చర్చిస్తూ ఉన్నటువంటి Constitution Amendment Bill లో చాలా ప్రశంసనీయములైన విషయములున్నాయి. భారతదేశం ఐక్యంగా ఉన్నపుడు బ్రిటిషు సామ్రాజ్యవాదులు ప్రవేశించి, జాతులను చీల్చి జాతి ఐక్యతను, సంస్కృతిని, నాగరికతను చిన్నాభిన్నంచేసి చీల్చి పరిపాలించటానికి కృత్రిమమైనటువంటి రాష్ట్రాలను ఏర్పాటు చేశారు. దానివల్ల జాతుల ఐక్యత పెంపొందకపోగా. జాతులకు మధ్య అనైక్యత చేకూరిందని మనం తెలుసుకొన్నాము. అందువల్లనే భారత దేశంలో ఉన్న జాతులన్ని మాకు భాషాప్రయుక్తరాష్ట్రములు కావలెనని అనేక సంవత్సరములుగ పోరాడినదాని ఫలితంగా ఈనాడు భారతప్రభుత్వం భాషాప్రయుక్త రాష్ట్రం కావలెననేదానికి ఒప్పుకోవలసి వచ్చింది. మొట్టమొదటిసారిగ భారతదేశంలో ఆంధ్రదేశం ఒక ప్రశంసనీయమైనటువంటి పాత్రవహించింది. అదే ఇతర రాష్ట్రాలలో ఉన్నటువంటి ప్రజానీకాన్ని ఉత్తేజపరిచింది. అందువల్లనే మనం ఈనాడుభాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం సాధించుకోగలిగాము. ఇది కాగితములో ఉన్నటువంటి, అనేకమైనటు

వంటి అనైక్యతావిధానాలను ఛేదించి ఈనాడు జాతులను ఐక్యంచేయడం చాల ప్రధానమైనటువంటి విషయం. ఈనాడు మనం ఆంధ్రరాష్ట్రం సాధించుకొని కూడ మనసోదరులు వేరుగ ఉన్నందువల్లనే, అనేక విషయాలలో ప్రభుత్వం కలసి చర్చించనిదే, అంగీకారానికి రాలేకపోయేటటువంటి అంతరాయాలను కూడ, ఈనాడు ఆంధ్ర ప్రదేశ్ సాధించలేకపోతున్నాయి. అందువల్ల ఈ భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం మన భారతదేశంలో విప్లవకర మైనటువంటి విధానము. అయితే ఇందులో ఎంతగొప్ప విషయం ఉన్నప్పటికీ కూడ, అందులో కొన్ని లోట్లు కూడ ఉన్నాయి భాషాప్రయుక్తరాష్ట్రాలను ప్రభుత్వం అన్ని పార్టీలు అంగీకరించితే ద్విభాషా రాష్ట్రం కావలెననే వాతావరణం రావడం. Bihar Bengal ఐక్యంగా ఒకటిగా ఉండాలనే విధానం వచ్చినపుడు అక్కడి ప్రజలంతా కూడా వ్యతిరేకించినపుడు, ప్రభుత్వం దానిని సర్దుతూరావడం జరిగింది. కాని ప్రభుత్వం ఆ అనుభవాన్ని గుర్తించుకొని మహారాష్ట్రులకు, గుజరాతీలకు వచ్చినటువంటి తగాదాలలో సరియైనటువంటి పరిష్కారం చూపకుండా మరల ద్విభాషారాష్ట్రములు ఏర్పాటు చేశారు.

Mr. SPEAKER :—How are aggrieved.

SRI S. KASI REDDI :— అందువల్ల ఇలాంటి విధానాలను మనము సవరించుకోవలసి యున్నది. ఇకపోతే Legislative Councils ను ఏర్పాటు చేయడం జరుగుతుంది.

Mr. SPEAKER :—The option is left to the Andhra Pradesh Assembly.

SRI S. KASI REDDI :— ఈనాడు మన అనుభవం తీసుకొన్నట్లయితే అది అవసరంలేదనేది మనకు తెలుస్తుంది. అలాగే ఏ రాష్ట్రంలోకూడ ఈ Legislative Council ఉంచవలసిన అవసరం లేదు. పైగా ¼ నుంచి ⅓ కు Legislative Council కు ఎన్నుకోవచ్చునని ఉంది. అంటే ఇంకా ఎక్కువచేయడం అనేదికూడ అనవసరం. అందువల్ల ఈ Legislative Council కూడ ప్రజలు ఎన్నుకొన్న అసెంబ్లీ ఉన్నపుడు అది అనవసరమని అది కేవలం గౌరవనీయులైన సభ్యులు చెప్పినట్లుగా ఓడిపోయినవాండ్లను అనుచరులను తీసుకొనిరావడం తప్ప పెద్దగా ఉపయోగపడేది ఏమి ఉండదని నా ఉద్దేశం. ఇక ఎన్నికలు 5 సంవత్సరాలదాకా కూడా లేకుండా మన ఆంధ్రరాష్ట్రానికి ఉన్నాయి. అంటే ఇది సరియైన విధానంకాదు,

తెలంగాణాలో ఎన్నికలు జరిపినట్లయితే సరియైన పద్ధతిగా ఉంటుంది. అందువల్ల ఎన్నికల విషయంలోకూడ అవి జరుగవలసి ఉంటుంది, అనేది నా ఉద్దేశం. భాషా విషయంలో మన ఆంధ్రప్రదేశ్ సాధించినతర్వాత అక్కడ ఉర్దూ తెలుగు భాషలు రెండూకూడా ఉంది. కాని బహుళసంఖ్యాకులు తెలుగుభాషనే మాట్లాడు తున్నారు కాబట్టి అక్కడ శాసనసభలో కూడ తెలుగుభాషనే ప్రవేశించి పెట్టడం అనేది అవసరం. అలాంటి మార్పు చేసుకొంటే మనము సాధించిన విజయాలను ముందుకు తీసుకొనిపోవుటకు కృషిచేయాలని చెప్పతూ ముగిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, మనం States Reorganisation Actను అనుసరించి ఈ constitution amendment బిల్లు చర్చిస్తున్నాము. States reorganisation ఎంత అవసరమో నేను ఎక్కువగ చెప్ప వలసిన అవసరంలేదు. దీంట్లో ప్రధానంగా ఈరోజున మనం 1928 సంవత్సరంలో నెహ్రూ రిపోర్టులో ఏ అంశం సూచించారో ఏవిధంగాఅయితే భాషాప్రయుక్త రాష్ట్రాలను నిర్మించాలని సూచించారో, ఆవిధంగా ఈనాటి కేంద్రప్రభుత్వం నిర్మించడానికి పూనుకోకపోయినప్పుడుకూడ, ఆపద్ధతిలో సాగినందుకు మనం సంతోషించవలసిందే. ఎన్నితగాదాలు వచ్చినప్పటికికూడ మనం ఆంధ్రదేశంలో మాత్రం ఏవిధమైనటువంటిఆందోళనలేకుండా ఆంధ్రప్రదేశ్ సాధించుకొనగలిగాము. ఈసందర్భంలోనే boundary సమస్యకూడ మనం తీసుకోవలసిన అవసరంఉంది. Tamilnad లాగా ప్రభుత్వందగ్గరో, మరిఎక్కడో సత్యాగ్రహంచేసి ఆందోళనచేయక పోయినప్పటికి మన boundaries ను గురించి మనం చాల శ్రద్ధగాఉన్నాం, చాల పట్టుదలగాఉన్నాం అనేవిషయాన్ని కేంద్రప్రభుత్వానికి తెలియచేయవలసిన అవసరం ఉంది. ఎక్కడో సత్యాగ్రహంచేసినను కొంతమంది గట్టిగా కేకలు వేసి మాట్లాడి నపుడు కేంద్రప్రభుత్వం తలక్రిందులుఅయిపోతుందేమో అనిచెప్పి మనకు నష్టము కలిగించేటటువంటి విధంగా ప్రవర్తించకుండాచూడవలసినబాధ్యత మనమంత్రివర్గం మీదఉన్నది. ఒక వేళ నష్టంజరిగేటటువంటి పరిస్థితులలో మనంకూడ దానిని resist చేయవలసినటువంటి అవసరం కూడ ఉన్నదని మాత్రం నేను తెలియచేస్తున్నాను. ఎందువల్ల అంటే కేవలం కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకొనిరావడానికి Tamilnad లో సత్యాగ్రహం జరుగుతున్నది. ఒక న్యాయమైన సూత్రాన్ని మనం తెలియచేసినపుడు అన్ని border సమస్యలను గ్రామాలవారీగా, contiguity ని దృష్టిలో పెట్టుకొని నిర్ణయించుకొందాము అని మనప్రభుత్వం తెలియజేసినప్పటికి కూడ దానిని పాటించకుండ ముందు మా విషయం తేల్చండి, మాకు వచ్చేది

ఏమో తీసుకొని, మీకు వచ్చేదానివిషయం తర్వాత ఆలోచించుకొందాములే అని చెప్పేటటువంటి పద్ధతి ఏ మాత్రం సరియైనది కాదని తెలియచేయవలసిన అవసరం ఉంది అని నేను అభిప్రాయపడుతున్నాను. అందువల్ల మనం జాగ్రత్తపడవలసి యున్నది. ఇదివరకే మనము చాల నష్టపడిపోయాము. మనకు రావలసినటువంటి Kolar రాకుండాపోతున్నది. అదేవిధంగా ఈనాడు మద్రాసులో ఉండేటటువంటి సమస్యలను ఈ ఇతర సమస్యలతో సంబంధంలేకుండా పరిష్కారంచేసేటట్లయితే మనకు నష్టము వచ్చేటటువంటి ప్రమాదం ఉంది అని మాత్రం మన మంత్రివర్గానికి తెలియచేస్తున్నాం. ఆ విధంగా జరుగకుండాచూడమని మాత్రం మంత్రివర్గాన్ని కోరుతున్నాం. వాండ్లు ఊరక అక్కడ సత్యాగ్రహం చేశారనో పెద్ద నాయకులు పోయి కేంద్రప్రభుత్వంలో వారియొక్క ప్రతినిధులు Tamilnad యొక్క ప్రతినిధులుగ కేంద్రప్రభుత్వంలో ఎక్కువమంది ఉండడంవల్ల, మనకు ప్రాతినిధ్యం లేకుండాపోవడంవల్ల, వచ్చేటటువంటి ఇబ్బందులు, నష్టాలు కలుగకుండా చూస్తారని నేను పూర్తిగ ఆశిస్తున్నాను. అన్ని boundary సమస్యలు కూడ మనము సౌహార్దయంతోనే పరిష్కారం చేసుకోవాలి. అలాగు కాకుండా state - re-organisation అయిపోయినతర్వాత చిన్న చిన్న తగాదాలు అన్నీకూడా మాసిపోతాయి అని మనము అనుకొంటూఉంటే, అలా కాకుండా ఈనాడు మద్రాసులో వంద మందికూడ సత్యాగ్రహంచేసి జెయిళ్లకుపోయి కూర్చొంటు ఉన్నారు. అవిఅన్ని మనకు అనవసరం. వారు అవలంబించే పద్ధతిమాత్రం మన ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకొనిరావడానికి మనకు నష్టంకలిగించేటటువంటి విధంగా జరిగేటట్లయితే మంత్రివర్గం తీవ్రంగా ప్రతిఘటించవలెనని నేను చెప్పుతున్నాను. తరువాత దీంట్లో zonal councils తీసుకొనివచ్చి పెట్టారు. Boundary సమస్యకు ఈ zonal councils వల్ల ఉపయోగంఏమి? నాకు ఏమి అగుపడడంలేదు. వాండ్లు ముఖ్యంగా ఇందాక ఒకమిత్రుడు చెప్పినట్లు, మన boundary సమస్యలు, అన్నీ పరిష్కారంచేయలేరు Boundary సమస్యను పరిష్కారం చేయవలసింది కేంద్రప్రభుత్వం. అలాంటప్పుడు కేవలం ఒక మద్రాసుప్రభుత్వంతోనే సంబంధం ఉన్నట్లు ఉన్నది. అందువల్ల ఏమీ ఉపయోగంలేదు. కొద్దోగొప్పో నష్టంవస్తుందేమో? అందువల్ల ఈ zonal council పెట్టవద్దు. దీనిమీద ఒక సెక్రటరీని వేస్తున్నారు. ఆ సెక్రటరీకూడ దాదాపు మన రాష్ట్రీంనుంచి ఉండడు అని తేలిపోయింది. అందువల్ల మద్రాసురాష్ట్రానికి సంబంధించినవానినే వేస్తారని తెలుస్తున్నది. అవి అన్ని చూచి వాండ్లకు మనకు ప్రధానంగా తగాదాలు ఉన్నప్పుడు, అక్కడివాండ్లనే వేసేదానికంటే మరి ఎవరి

నైనా వేయించడానికి ప్రయత్నంచేయడం మంచిది అని నేను అభిప్రాయపడుతున్నాను. ఇవి అన్నికూడ వీటిక్రిందనే ఉన్నాయని అనుకొంటున్నాను. తర్వాత అన్నిటికన్న ప్రధానమైనవిషయం ఈ రోజు మనకు ప్రత్యక్షంగా సంబంధం లేకుండాపోయినప్పటికికూడ భారత దేశం లో భాగస్వాములుగ, భారతదేశ అభివృద్ధిని ఆకాంక్షిస్తూ ఉండేవారికి మనం ఆశించింది ఏమిటి? ఈరోజు బొంబాయి రాష్ట్రం ద్విభాషా రాష్ట్రంగా ఉంది. అలా కాకుండా మొట్టమొదట వారు నిర్ణయించినట్లు మరాట్వాడాలో బొంబాయినికూడ చేర్చి, గుజరాతును వేరే రాష్ట్రంగ ఉంచినట్లయితే ఈనాడు జరిగినటువంటి దారుణమైనటువంటి నష్టాలు కాని, ఆందోళనగాని వచ్చిఉండేవికాదు. ఎచ్చోట్లకూడ భాషాప్రయుక్తరాష్ట్రాలు, ఆ సిద్ధాంతాన్ని అంగీకరించినపుడు, ఆచరణలో పెట్టాలి. కాని అక్కడికి వచ్చేటప్పటికి మళ్ళా తిసుకొనివచ్చి ఈ రెండు భాషలను కలిపి, ఒక రాష్ట్రముగ తీసుకొనివచ్చి పెట్టడానికి పూనుకొన్నారు. పెట్టారు. దానివల్ల లాభంకంటే నష్టమే ఎక్కువ వచ్చిందని మనంచూస్తున్నాం. అనేకమంది ప్రాణాలు కోల్పోయినారు. బ్రహ్మాండమైనటువంటి నాయకత్వం గుజరాతి అంతామాదే, మాదే అని చెప్పుకుంటూ ఉన్నప్పటికి కూడ నాయకులమాటకూడ ఎక్కడా ఖాతరు చేయకుండా ప్రజానీకం ఈ పద్ధతి మాకు పనికిరాదని వీధులలోకివచ్చి చెప్పారు. అయినప్పటికికూడ వినటం అనది నేర్చుకొనలేదు. కొంతమంది చెప్పినమాటలకే కేంద్రప్రభుత్వంలో పలుకుబడి చెల్లుబడి ఉంది అనే విషయాన్ని బొంబాయి గుజరాతి రాష్ట్రములో జరిగిన సంఘటననుబట్టి మనకు బోధపడుతుంది. అందువల్ల ఏమైనప్పటికి సరే, మనం ప్రజాస్వామిక పద్ధతులద్వారా పరిష్కారం చేసుకోవలసినటువంటి సమస్యలు అన్నికూడ ఆ పద్ధతిద్వారా పరిష్కారం చేసుకోవాలి. ద్విభాషారాష్ట్ర సిద్ధాంతం ఏమాత్రం ఉచితం కాదని అభిప్రాయ పడుతున్నాము. కేంద్రప్రభుత్వంలో ముఖ్యనాయకులు ఈ భాషా ప్రయుక్తరాష్ట్రసిద్ధాంతానికి ప్రత్యక్షంగా ఆమోదించక పోయినప్పటికి కూడ ఆచరణలో పెట్టవలసినటువంటి అవసరం వచ్చిందనే విషయాన్ని ఈరోజు మనం చూస్తున్నాం. అదే సూత్రాన్ని బొంబాయి రాష్ట్రానికికూడ వర్తించిఉన్నట్లయితే గుజరాతి, మహారాష్ట్ర రెండు రాష్ట్రాలుగ ఉండిఉండేది. తగాదాలు లేకుండా పోయేవి. Border సమస్యలు అంటారా? చిన్నచిన్న సమస్యలు పరిష్కారం చేసుకోవచ్చు. ప్రభుత్వంలో కొంతమంది ఆశించినట్లు ఇతరులమీద ఒత్తిడిచేసి ఇతరుల ప్రాంతాలను కాజేయాలనే దురుద్దేశంలేకపోతే సమస్యలు అన్ని అతి తేలికగా పరిష్కరించడానికి

వీలున్నది అని మాత్రం తెలియచేస్తూ ఈ Constitution Amendment Bill తప్పకుండా ప్యాసుకావలెనని, చాల అవసరమనికూడ అభిప్రాయపడుతూ ఇంతటితో ముగిస్తున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI :— అధ్యక్షా! మొత్తము మీద ఈ ప్రతిపాదనకు అన్ని సెక్షన్సునుంచికూడా ఆమోదం వచ్చింది. కానీ ఆమోదం ఇస్తూ వారి వారి అభిప్రాయాలను చెప్పడంకూడా సమంజసమైనట్టి విషయమే. ఈ Bill కు సంబంధం లేకపోయినప్పటికిన్నీ Legislative Council ఇప్పుడైనా వస్తుందేమో, అటువంటి ప్రమాదమునుంచి తప్పించవలెను అనునట్టి ఉద్దేశముతో opposition నాయకులు ఈ విషయం ప్రస్తావన చేసినారు. మనం ఈ Assembly లోనే Legislative Council కావాలనీ ఒకసారి కోరినప్పటికీ కూడా పార్లమెంటువారు దానిని అంగీకరించకుండా ఎప్పుడో ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తరువాత కావాలంటే మీరు చేసుకోండి, మేము ఏమీ ఇక్కడ నిర్ణయించడంలేదు అనే మాటగా వారు చెప్పినారు. దానికి ప్రతిపక్షనాయకులు హర్షాన్ని వెలుబుచ్చుతారు అని అనుకొన్నాను. కాని వారు వెలుబుచ్చలేక పోయినారు.

తర్వాత Zonal Council తో ఏదైనా ప్రమాదం వస్తుందేమో. ఎందుకు ఈ Zonal Council మనకూ, పంజాబుకూ, అనేటటువంటి మాటగామాత్రం చెప్పినారు Joint Select Committee లో లోక్‌సభలో, రాజ్యసభలోకూడ ఈ విషయమై చర్చ జరిగింది. అన్నీ జరిగిన తర్వాత కొంతకాలం వాళ్లకున్న అనుమానాలను తీర్చడంకోసం పరస్పరం ఒకరికొకరు అభిప్రాయాలను తెలుసుకోవడంకోసం Inter State Ministers Conference అప్పుడప్పుడు జరుగుతూ ఉంటే మంచిదేమో అనేటటువంటి ఉద్దేశ్యంతో Zonal Councils పెట్టడం తటస్థించింది. దానికికూడా మనం ఈనాడు ఆక్షేపణ చెప్పనక్కరలేదేమోనని అనుకుంటాను. ఇక Regional Committee విషయం. తెలంగాణావారికి ఉన్నటువంటి అనుమానాలను తీర్చేదానికోసం ఈ Regional Committee కొంతకాలం ఉంటుంది. దానివల్ల ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటుకు గానీ, అసెంబ్లీకిగాని, ప్రజలకుగాని ఏదో విభిన్నత ఏర్పడుతుంది అనేటట్టి భయంకూడా అవసరంలేదు. ఎవరికైతే అనుమానాలు ఉన్నాయో వారి అనుమానాలను తీర్చవలసినటువంటి బాధ్యత జ్యేష్ఠ సోదరునిమీద ఉన్నది. ఈ జ్యేష్ఠసోదరుడు ఈనాడు ఆంధ్రాఅసెంబ్లీ మెంబర్లు,

Dr. B. Gopala Reddi ]　　　　　　　　　　　　[ 30th September 1956

ఆంధ్రగవర్నమెంటుకు సంబంధించినటువంటివారుగా ఉన్నారు. అటువంటి పరిస్థితిలో మనయొక్క ప్రవర్తనవల్ల మనయొక్క ఔదార్యమువల్ల వారికి ఈలాంటి అనుమానాలు కూడా లేకుండా చేసుకోవలసిన అవసరం ఉంది. అందువల్ల ఈ Regional Committee కి కూడ ఆక్షేపణ చెప్పనక్కరలేదేమోనని నేను అనుకొంటాను. ఇక నాకు సంబంధించినంతవరకు రాజప్రముఖులు లేకుండాచేయడం పెద్ద విప్లవకరమైన ఒకమార్పు అనే అనుకొంటాను. ఆరువందల చిల్లర సంస్థానాధీశులు ఉండినారు మొన్నటివరకు, దశాబ్దముక్రింద వారందరూకూడా ఏ ఏడు ఎనిమిది మందో రాజప్రముఖుల క్రింద తయారు అయినారు. వారుకూడా ఈనాడు, రేపు నవంబరు ఒకటవ తేదీకి, రాజప్రముఖులుగా ఉండరు. ఇక రాజులు మహారాజాధిరాజులు మనంఎప్పుడో నవలల్లో లేకపోతే కథల్లో, ప్రబంధాలలో చదువుకొన్నటువంటి మహారాజులంతాకూడా ఈనాడు మృగ్యమైపోతున్నారు. అంతాకూడా చరిత్రలో లీనమైపోతున్నారు. అందువలన ఈనాడు అది చాల పెద్దవిషయం. మన ప్రజాస్వామికం అయినటువంటి ఈ పద్మం దినదినానికి వికసించుచున్నదేమో. ఒకసారిగా జమీందారులను లేకుండాచేసింది ఈ ప్రజాస్వామికమే. ఈనాడు మహారాజులను కూడా లేకుండాచేసింది. కడపటికి మహారాజులకు చిహ్నంగా ఉన్నటువంటి తొమ్మిదిమందో, ఎనిమిదిమందో రాజప్రముఖులనుకూడా లేకుండాచేస్తున్నది. నవంబరు ఒకటవతేదీనాటికి ఈ పద్మం సంపూర్ణంగా వికసించపోతున్నది. ఈమాదిరిగా ఎన్నాళ్ళనుంచో, అనాదినుంచి ఉన్నటువంటి రాజులు బహుశా రాముడి కాలంలో, అంతకుముందునుంచి కూడా కృతయుగంనుంచి వస్తున్న ఈ రాజ సంప్రదాయం— ఈ Princely Order అంతా కూడా — ఒక్కసారిగా లేకుండా పోతున్నది, అనేటటువంటి విషయం కూడా చూస్తున్నాము. అందువల్ల బిల్లు చిన్నదైనప్పటికీ కూడా పెద్ద పదవులు, ఎన్నాళ్ళనుంచో ఉన్న పదవులు తీసివేస్తూ భవిష్యత్‌కు అంతా కూడా పునాదులు వేసుకొంటూ ఉన్నాము. మనకు ఆంధ్ర రాష్ట్రం రావడం సరిగ్గా మూడు సంవత్సరములనాడు, అది అక్టోబరు ఒకటవ తేదీ కావున ఈ దినం సెప్టెంబరు ముప్పైవదినం కావున, సరిగ్గా మూడు సంవత్సరాల నాడు ఒక experiment గా మనకు రాష్ట్రం ఇచ్చినారు. మనం కోరినటువంటి కోర్కెనుబట్టి ఇవుడు ఆంధ్ర రాష్ట్రం ఇస్తున్నాం కొందము రాష్ట్రాల విషయం కూడా కొంతవరకు మేము వాయిదా వేస్తాం. ఇది సక్రమంగా జరిగితే ఇతర రాష్ట్రాలను కూడా ఇస్తాం, ఇది సక్రమంగా జరగకపోతే దీనినిబట్టి మేము ఇతరులకు ఇవ్వలేము అనేటటువంటి భావంగా కేంద్రప్రభుత్వం ఒకప్పుడు

ఉండినది. కానీ ఇక్కడ ఈ మూడు సంవత్సరములలో ఆంధ్ర శాసనసభవల్లగానీ ఆంధ్ర ప్రభుత్వంకానీ ఏదోకొంత నిలకడగానే, స్థిరత్వముతోనే కొంతవరకు పని జరిగించినదానివల్ల ఇతర రాష్ట్రాలు, కన్నడలేక కేరళ వగైరా రాష్ట్రములు ఇచ్చినప్పటికినీ పరవాలేదు అనేటటువంటి ఉద్దేశంతోనే మనం చూపించినటువంటి ఆదర్శంవల్లనే కొంతవరకూ ఈనాడు యావత్ భారతదేశంలోని రాష్ట్ర విభజన సమస్య పరిష్కరింప బడుతోంది. భాషాప్రయుక్త రాష్ట్రాలనేటటువంటి సిద్ధాంతాలను అంగీకరించి, ఏవోకొన్ని exceptions ను పెట్టుకొన్నప్పటికి కూడా, మనం ఆంధ్రులమైనవారు, దీంట్లో, play చేసినటువంటి పాత్ర, ఒక సముచితమైనటువంటి పాత్ర; శ్లాఘనీయమైన పాత్ర, ఇతరులందరికీ కూడా ఆదర్శనీయంగా ఉన్నటువంటి పాత్రగా ఉన్నందుకు కూడా చాలా సంతోషం.

ఇక పోతే ఉన్నటువంటి విషయాలు ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాత ఏమి జరిగింది అనేది. Administration అంతా కూడా ఇంకా తెలుగులో రాలేదే అనేటటువంటి ఆవేదన మన గోపాలకృష్ణయ్యగారికి వగైరాలకు, వెంకటేశ్వరుల గార్లకు ఉన్నాయి. అయ్యో మన శాకీదులన్నీ, మన Gazette అంతా కూడా, మన Budget speach, Budget memoradum అంతా కూడా తెలుగులో కాలేదు అనే అవేదనను వారు ప్రకటిస్తున్నారు. న్యాయమైనటువంటి ఆవేదనే అది. కానీ దాంట్లో కొన్ని administrative difficulties ఉన్నప్పటికీ కూడా చేయలేక పోయినప్పటికీ కూడా ఒకటి మాత్రం నాకు స్పష్టంగా కనబడుతున్నది. ఈనాడు మన అసెంబ్లీలో నున్నటువంటి అనేకమంది మెంబర్లు ఎంతో నైపుణ్యంగా, ఎంతో చాతుర్యంగా, ఎంతో హాస్యంతో కూడినటువంటి ప్రశ్నలు, ఉపప్రశ్నలు, ఉపన్యాసాలు, ఇవన్నీ కూడ చేయడానికి ఈనాడు అస్కారమైనది. నేను అదే అనుకొంటూ వచ్చినాను ఇప్పుడు. మన గున్నయ్యగారు మద్రాసు శాసన సభలో సభ్యులుగా ఉండినారు. వారు ఆనాడు అక్కడ ఎట్లా ఉండినారో నాకు తెలియదు. నేను అక్కడ మెంబరుగా లేను. వారు అక్కడ ఏ మాదిరిగ questions వేస్తుండినారో, ఏ మాదిరిగా ఉపన్యాసాలు చేస్తుండినారో నాకు మాత్రం తెలియదు. కానీ ఇక్కడ ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాత ఒక్కసారిగా వారి ప్రతిభ వెల్లి విరిసినదా అన్నట్టుగా ఉంటూఉన్నది. నిజంగా గున్నయ్యగారు ప్రతివిషయం అడిగినప్పటికికూడా దాంట్లో ఏదో ఒక సూటిఅయినటువంటి విషయం, అందరికీ నవ్వు కలిగించేవిషయం, కొంత సత్యంకుయిటువంటివిషయం అంతాకూడా ఉంటున్నది. అటువంటివారంతాకూడా అనేకమంది ఈనాడు English తెలిసినప్పటికీకూడా

English లో స్పష్టంగా చెప్పడానికి వీలులేనివాళ్ళు అనేకమంది ఉండవచ్చును. వారందరికీకూడ తమయొక్క constituency కష్టసుఖములను చెప్పడానికి ఇది అవకాశంగా ఏర్పడింది, ఆంధ్రరాష్ట్రమువచ్చినతర్వాత మీరు ఏమి సాధించినారు అంటే మాప్రజాప్రతినిధులైనవారు వారివారి కష్టసుఖాలనంతాకూడా స్పష్టంగా చెప్పడానికి ఏలాటిజంకుగొంకులూలేకుండా వాళ్ల మాతృభాషలోనే చెప్పడానికి ఒక పెద్ద, మహత్తరమైన అవకాశంకల్పించినాం, ఇంకేమిచేసినా చేయకపోయినా, అనేమాదిరిగ మనం మనరాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకొన్నాం. ఈనాడు ఎంతమందో, మన పోతరాజుగారు, మనగున్నయ్యగారు వంటివారు ఉన్నారు. హరిజనులేకాదు, హరిజనులుకానివాళ్లంతాకూడాఉన్నారు. మన బిశెట్టి అప్పారావు వగైరాలంతా కూడ English ఎక్కువ చదువుకొని మాట్లాడశక్తి లేకపోయినప్పటికీనీకూడా ఎంతోచక్కగా తమఉపన్యాసాలను తెలుగులో చేస్తున్నారు. 'గవర్నమెంటుకు చెప్పదలచుకొన్న విషయాలన్నింటినీకూడా స్పష్టంగాకూడా చెప్పడానికి అవకాశం ఏర్పడుతుంది.

దేశమంతటిలోనూ 5 రాష్ట్రములు భాషాప్రయుక్తంగా సిద్ధించినవి. బొంబాయిలోనూ, హైద్రాబాదులోనూ, మద్రాసులోనూ కొంతమంది కన్నడిగలున్నారు. వారంతా ఒకేరాష్ట్రంక్రిందకు వచ్చికన్నడభాషలో మాట్లాడుకో డానికి అవకాశం లభిస్తున్నది. అందువల్ల మన ఈ రాష్ట్రాలు భవిష్యదభివృద్ధికి ప్రాతిపదికగా వుండుటకువీలుగానున్నవి. ప్రజాస్వామికమునకు ఒక మూలసూత్రంగా, స్తంభంగా భాషాప్రయుక్త రాష్ట్రాలుకూడా వుండడం మంచిదేమోననిపిస్తున్నది. బొంబాయి విషయంలో మనం ఆందోళన పడనక్కరలేదు. దానిని గురించి బొంబాయికి ఉత్తరంగానూ, దక్షిణంగానూ కూడా ఆందోళనలు జరిగాయి. ఏమైనప్పటికి ఈనాడు ప్రశాంత వాతావరణం నెలకొల్పబడుట చాలా సంతోషకరమైన విషయం. బొంబాయి ప్రాముఖ్యతను అంతర్జాతీయంగా తగ్గిపోకుండా చూస్తారనీ, ఇకముందుకూడా వాణిజ్యానికీ, పరిశ్రమలకూ కేంద్రంగా వుండగలదనీ, అక్కడ వున్న వారందరూ సోదరభావంతో మెలగగలరనీ ఆశిస్తున్నాను.

గుజరాతులో ప్రత్యేకరాష్ట్రం ఏర్పాటు చేసుకోవచ్చును. దీనికోసం పెద్ద తగాదా పడవలసిన అవసరం లేదనుకొంటాను. మనం ఆంధ్రప్రదేశ్‌ను స్థాపించుకోగల్గినామేగాని విశాలాంధ్రను స్థాపించుకోలేదు. కమ్యూనిస్టుపేపరు విశాలాంధ్ర

గానే వుండవచ్చు. మనది ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అయినది. ఆంధ్రప్రదేశ్‌కు బయట తెలుగువారు చాలమంది ఉన్నారు. ఈనెల 18వ తేదీన నేను పర్లాకిమిడలో ఒక అరగంట ఉన్నాను. అక్కడివారి నైరాశ్యమంతా ఆ ఒక్క అరగంటలోనే చూడ గలిగాను. ఆంధ్రప్రదేశ్ వస్తున్నది. నవంబరు 1వ తేదీన మనమంతా 'ఆంధ్ర ప్రదేశ్' అవతరణోత్సవం జరుపుకోబోతున్నాము. కాని పర్లాకిమిడిలోని ఆంధ్రులు ఒకవిధమైన నైరాశ్యంతో ఉంటున్నారు "మాస్థితి ఏమిటి? Where are we? మా విషయం ఏమీ తేల్చలేదా? Home Minister గారు ఏమన్నారు? ఇతరమంత్రులు ఏమన్నారు" అని ఆందోళనగానే వారు మాట్లాడుకొంటున్నారు. చెంగల్పట్టులోనూ, బళ్లారిలోనూకూడ తెలుగువారున్నారు, ఒకవైపు ప్రజలలో కోలాహలంకనిపిస్తూంటే మరొకవైపువారిలో నైరాశ్యవాతావరణంకనిపిస్తున్నది. "ఘర్ ఘర్ మె దివాలీ" అన్నట్లుగా ఒకవైపు అందరూ దీపావళి పండుగ చేసి కుంటున్నారు. ఇంకొకవైపున మా దీపాలు ఆరిపోయాయా? అనుకొంటున్నారు. దీనికి మనం చేయవలసినదేమీలేదు. మనమీద కేంద్రప్రభుత్వంవారు అవిశ్వాసంతో చూడవలసినపనిలేదు. సరిహద్దుసమస్యలన్నింటినీ సమగ్రంగా పరిష్కరించుటకు గాను కేంద్రప్రభుత్వంవారు ఒక కమిటీని నియమించిగాని, లేక ఒకమూలసూత్రం చెప్పి "ఈ పధంగా పరిష్కారంచేసుకోండి" అని మనకుయిస్తే బాగుంటుందను కొంటున్నాను. కేంద్రప్రభుత్వంవారు ఇట్లా direct చేస్తే ఎవ్వరూకూడా నైరాశ్యం చెందవలసిన అవసరంలేదు. కొన్ని తాలూకాలవారో, జిల్లాలవారో "మాకు education facilities లేవు, employment opportunities లేవు, ప్రభుత్వం మమ్ములను, హీనంగా, అవిశ్వాసంతో చూస్తున్నది" అని అనుమానంపడవలసిన అవసరంలేదు. ఏమైనప్పటికిన్నీ boundary disputes ను పరిష్కరించుకొనుటకు కేంద్రప్రభుత్వంవారు కొన్ని ముఖ్యసూత్రాలను తెలియజెప్పి "మీరు ఈ సూత్ర ప్రకారంగా మీ మీ సరిహద్దుసమస్యలను పరిష్కరించుకోండి" అని చెపుతారని ఆశిస్తున్నాను. ఈ మధ్య మద్రాసులో సరిహద్దుసమస్యలనుగురించి సత్యాగ్రహం చేసి మద్రాసుప్రభుత్వంమీద ఒత్తిడికల్గజేయడం చాలా విచారకరమైన విషయం. ముఖ్యంగా మనప్రాంతమైన తిరుత్తనినుంచి మద్రాసుపోయి అక్కడ సత్యాగ్రహంచేశారు. అందులో కొంతవరకు మనబాధ్యతకూడావున్నది. మద్రాసువారు చేసినట్లయితే మనకుసంబంధంవుండదు. మనవారుపోయి మద్రాసుప్రభుత్వంమీద ఒత్తిడికల్గజేశారు. ఆ సందర్భంలో 500 మందివరకు అరెస్టుఅయినారు. ఇది సమంజసమైనవిషయంకాదు. "మనం తిరుత్తనిలో అరవలుగావుండి ఆంధ్రప్రదేశ్‌లో

చేరితే మనకు సరైనన్యాయం కల్గదేమో" అనే అవిశ్వాసంతో చేసినారు. అట్లాంటి అవిశ్వాసాలన్నీ తొలగించుటకు ప్రభుత్వాలు ప్రత్యేకమైనపద్ధతిలో కృషి చేస్తే న్యాయంగా వుంటుంది. న్యాయంగా ఆలోచిస్తే ఈనాడు పర్లాకిమిడిలో ఉన్న ఆంధ్రులకు నైరాశ్యం ఎందుకుకలగాలి? అక్కడి ప్రభుత్వం వారు వారిని న్యాయంగాచూస్తూ వారికి కావల్సిన employment opportunities, education facilities కలుగచేస్తూ ఓఢ్రులతోపాటు వీరినికూడా సమానంగాచూస్తే వీరికి నైరాశ్యం కల్గవలసిన అవసరంలేదు. అట్లాగే తిరుత్తనిలో ఉన్నవారికి ఎట్లాంటి ఇబ్బందులుకలుగుతున్నాయో నాకు తెలియదు. శ్రీ మొదలియార్ గారు కోరిన కోర్కెలన్నింటినీ ఆదరించి, సాధ్యమైనంతవరకు చేయుటకు ప్రయత్నిస్తున్నాను. ఈవిషయం మొదలియార్ గారుకూడా ఒప్పుకుంటారనిఆశిస్తున్నాను. ఆర్థికంగానూ, మానసికంగానూ కొన్ని కోర్కెలుంటాయి. కాని వారికికావలసిన facilities అన్నింటినీ కలుగచేయుటకు ప్రయత్నం చేస్తున్నాము. అయినప్పటికీ "మా స్థితి ఏమౌతుంది?" అనేబాధ, అనుమానాలవల్ల వారంతా అక్కడకుపోతామని చెబుతున్నారు. ఇటువంటివన్నీ తీర్చడానికి linguistic minorities ను protect చేయడానికి ఒక Commission రావడం నాకు చాలా సంతోషంగాఉన్నది. ఎవ్వరికీ ఎటువంటి అనుమానాలు లేకుండా "మీరు ఆంధ్రప్రదేశ్ లో ఉన్నప్పటికిని ఫరవా లేదు; ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మీకు కష్టాలు కలుగజేయదు" అని ఒక linguistic minorities commissioner ఉండి చెప్పినట్లయితే బాగుంటుంది.

బర్హంపూర్ లో వున్నవారికీ, పర్లాకిమిడిలో వున్నవారికీ, హోసూరులో ఉన్నవారికీ కేంద్రప్రభుత్వంవారు "మీ ప్రభుత్వాలతో మేము మాట్లాడుతాము, మీరు ఆందోళన చెందనక్కరలేదు" అని హామీదులు ఇంపించినట్లయితే కొంతవరకు అనుమానాలు తీరుతాయి. ఈ ఉద్దేశ్యంతోనే ఈ కమిటీ రావడం సంతోషించ వలసినవిషయం. ఈ విషయంలో ఇదమిద్ధమైన ముఖ్యసూత్రాలు కేంద్రప్రభుత్వం వారు యిస్తే బాగుంటుందనే అభిప్రాయం మద్రాసు ప్రభుత్వానికి వ్రాశాము. దీంట్లో ఏమీ తప్పులేదు. ఈ పద్ధతి అన్ని రాష్ట్రాలకూ మంచిది. కేంద్రప్రభుత్వం వారిచ్చిన సూత్రాలతో సరిహద్దులను నిర్ణయించుకొంటే మంచిది. ఇది సరిహద్దు సమస్యలను పరిష్కరించుకొనేందుకు చేసినవే కాని, ఈ matter అంతా shelve చేయడానికి చేసినది కాదనుకొంటున్నాను.

కోలారులో మనకురావలసినభాగం ఉన్నది. నేను క్రిందటి సంవత్సరం యానాం వెళ్ళినాను. అక్కడున్నవారందరు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో కల్సి

కోడానికి ఉత్సాహంగా ఉన్నారు. దానికి కావలసిన తతంగమంతా ఫ్రెంచి అసెంబ్లీ వారు చేయవలసియున్నది. యానాం ఒక చిన్న భాగమే కావచ్చును.

తూర్పుగోదావరి జిల్లా మధ్యలో కొంతభాగంలోనివారు ఫ్రెంచిప్రభుత్వ జెండా క్రింద ఉండడం, లేకపోతే కేంద్రప్రభుత్వం క్రిందనో, పాండుచేరి క్రిందనో ఉండడం అంతమంచిదికాదు. యానాం కూడా సత్వరంగా ఆంధ్రప్రదేశ్‌లోకి రాగలదని ఆశిస్తున్నాను.

హైకోర్టు జడ్జీల విషయంలో ఎవ్వరూ ఎక్కువగా మాట్లాడలేదు. హైకోర్టు జడ్జీలను ఒకచోటనుండి మరొకచోటకు మార్చడం మంచిదికాదు అనే విషయంలో అభిప్రాయభేదాలుండవచ్చును. హైకోర్టు జడ్జీలను కలెక్టరుల మాదిరిగా transfers చేస్తారనే భీతి ఉండకూడదు. అట్లా చేస్తే వారికి ఉండే independence తగ్గిపోతుందేమో అనుకొంటున్నాను. కాని ఒక్కొక్కప్పుడు అక్కడున్నవారికి కొన్ని ఇబ్బందులుంటాయని Chief Justice గారు, కేంద్రప్రభుత్వంవారుఅనుకొన్నప్పుడు బదిలీ జరుగుతుందేమో గాని కలెక్టర్లమాదిరిగా జరిగేవిషయంకాదు. శ్రీకాకుళం జిల్లాకు 2 నెలలకు ఒక్కొక్క Collector గారు వస్తున్నారని ఇందాక గౌ. సభ్యులు చెప్పారు. ఈ మాదిరిగా హైకోర్టు జడ్జీలను transfer చేయడానికి వీలుండదు.

ఈమాదిరిగా మార్పులుచేస్తారేమో అనే అభిప్రాయం లోకసభలో కొందరు చెప్పారు. అటువంటిదేమీ జరుగకూడదు. వారికి independence వుండవలసినదే. కాని ఒక్కొక్కసారి ప్రత్యేకమైన పరిస్థితులలో వారిని ఇతర రాష్ట్రాలకు పంపినప్పుడు ప్రత్యేకమైన allowance లేకుండా చేయడం జరుగుతున్నది. అట్లా జరగడం మంచిదేమో అనిపిస్తున్నది. కాని ప్రత్యేక పరిస్థితులలో ప్రభుత్వ ఇబ్బందులకు కూడా కొందరు లొంగకుండా ఉంటారేమో అనిపిస్తున్నది. ప్రభుత్వం వేరు, మేము వేరు అనే భావంలేకుండా ప్రభుత్వం చెప్పినదానిని ఆచరణలో పెట్టవలసినదే. Law and order maintain చేయడంలో ప్రభుత్వ యిబ్బందులను కూడా గమనించవలసి వుంటుంది. పత్రికలన్నీ వాటి ఇష్టంవచ్చినట్లు వ్రాస్తుంటాయి. మత విద్వేషాలు, Communal tensions కల్గించే పేపరులు Northern India లో ఎక్కువగా ఉన్నాయి. హిందీ, ఉర్దూ, మరాటీ మొదలయిన పత్రికలున్నాయి. అటువంటప్పుడు హైకోర్టువారు ప్రభుత్వానికున్న ఇబ్బందులను కూడా గమనించవలసి వుంటుంది.

